# ఆంధ్ర శాసన సభ్యులు

1955




0-6-0

ప్రచురణ:-యన్. సత్యనారాయణరావు, గుంటూరు 2



ఆంధ్రరాష్ట్రానికి అసువు లర్పించిన

" అమరజీవి "

# పొట్టి శ్రీరాములు

# మీ కొక మాట

ఆంధ్రరాష్ట్రం ఏర్పడిన అనతికాలంలోనే ఆంధ్రప్రజలకు తమ ప్రతినిధులను ఎన్నుకొనే అవకాశంకలిగి ఈ సంవత్సరారంభంలో జరిగిన ఎన్నికలలో అమితోత్సాహంతో పాల్గొని వారి ప్రతినిధులను శాసనసభకు పంపారు. కానీ ఏ ఒక్కరూ అందరు సభ్యులనుగురించి తెలుసుకొని ఉండటం అసంభవం. అందరూ, అందరు శాసనసభ్యులను గురించి తెలుసుకొనే లాగుచేసి, రానున్న ఎన్నికలలో యిందలి సభ్యులకన్నా మెరుగైన అభ్యర్థులు ఉంటె ఎన్నుకొనే అవకాశం ఈ పుస్తకం కలిగిస్తుందని ఆశిస్తూ మీ కందచేస్తున్నాను.

మరోమాట నా ఈప్రయత్నంలో సహకరించిన శ్రీ నందమూరు కామరాజు, యం. కాం., ఏటుకూరు ప్రసాదరావు, దావులూరు సత్యనారాయణగార్లకు, అందముగాముద్రించిన శాస్త్రి శ్రీ ముద్రణాలయంవారలకు, స్వతంత్ర కన్సర్న్సు (బ్లాకు మేకర్సు) కు నా కృతజ్ఞత. దీనిని మీకు ఇంత తక్కువధరలో అందచేయుటకు తోడ్పడిన ప్రకటనదారులకు, నేను అడిగినవెంటనే వివరములుయిచ్చిన శాసనసభ్యులకు ధన్యవాదములు. ఇందులో కొందరి సభ్యుల చరిత్రలు విశేషంగా యివ్వలేకపోవటం, ఫోటోలు లేకపోవటం, వారి సహకారలోపమే కారణం.

—ప్రచురణకర్త.

# ఎన్నికల సమీక్ష

శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారి నాయకత్వాన నవ్యాంధ్రరాష్ట్రంలో ఏర్పడిన తొలి మంత్రివర్గం పదమూడు మాసముల పది హేను రోజులు అనంతరం మద్య నిషేధ సమస్యపై ప్రతిపక్షాలు ప్రతిపాదించిన అవిశ్వాస తీర్మానం ఒక్క ఓటు తేడాతో నెగ్గటంతో పతనమయింది.

భారతరిపబ్లిక్ అధ్యక్షుడు డా॥ రాజేంద్రప్రసాద్ ప్రత్యేక శాసనం ద్వారా ఆంధ్ర శాసనసభను రద్దుచేసి గవర్నరు పరిపాలనను ప్రవేశపెట్టారు. షుమారు నూటముప్పది ఐదురోజులు గవర్నరు పరిపాలన తదుపరి తిరిగి ఆంధ్రశాసనసభకు ఫిబ్రవరి, మార్చి నెలలలో ఎన్నికలు జరిగినాయి. ఈఎన్నికలలో అర్హతకలిగిన ఓటర్ల సంఖ్య మొత్తం 1,15,68,659, ఇందు పోలైన ఓట్లు 8.6.,30,311, ఎన్నికలకొరకు నిర్ణయించిన నియోజకవర్గాలు 167, అందులో 29 ద్విసభ్య నియోజక వర్గాలు కనుక ఎన్నిక జరుగవలసిన మొత్తంస్థానాలు 196. వీటిలో 26 షెడ్యూల్డు తరగతుల వారికి, 5 షెడ్యూల్డు జాతుల వారికి ప్రత్యేకించబడినాయి. మొత్తం దాఖలు అయిన నామినేషన్లు 950. అందులో నిరాకరించబడినవి 25, ఉపసంహరించబడినవి 344, ఇక పోటీ లేకుండా ఎన్నికైన ముగ్గురు కాంగ్రెస్ అభ్యర్థులుపోను, ఎన్నికల రంగస్థలంలో చివరిదాకా నిల్చి పోటీకి సన్నద్ధమైన వారి సంఖ్య 578, యిందు ఐక్య



ఆంధ్ర గవర్నరు
శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేదీ

కాంగ్రెస్ అభ్యర్థులు 185. కమ్యూనిస్టులు 169, ప్రజాసోషలిస్టులు 4౧, స్వతంత్రులు 162, జనసంఘం 6, ఎన్నికలలో పోలైన మొత్తం ఓట్లుపక్షాలవారీగా పొందుపరిస్తే కాంగ్రెసుకు 42,65,814, కమ్యూనిస్టులకు 26,95,562, ప్రజాసోషలిస్టులకు 4,82 825, స్వతంత్రులకు 11,73,745, జనసంఘానికి 4,201.

రద్దయిన ఆంధ్రశాసనసభలోని 117 మంది సభ్యులు ఈఎన్నికలలో పోటీచేశారు. వీరిలో 54 మంది మాత్రమే తిరిగి ఎన్నికైనారు. వారిలో పార్టీలవారీగా ఐక్యకాంగ్రెస్ 40, కమ్యూనిస్టు 8, ప్రజాసోషలిస్టు 3, స్వతంత్రులు 3, గెలుపొందారు. శ్రీ ప్రకాశం వంత్రి మండలియందలి ఏడుగురు సభ్యులలోని ఒక్క తెన్నేటి విశ్వనాథంగారు మినహా మిగతా వారందరూ ఎన్నికైనారు. గడచిన ఆంధ్రశాసనసభలో ఒక్క ముస్లిం శాసనసభ్యుడు కూడా లేని లోటును, ప్రస్తుత శాసనసభలోని నల్గురు మహమ్మదీయ సభ్యులు తీర్చారు. పార్టీలక్రమంగా ఐక్య కాంగ్రెస్ 3, కమ్యూనిస్టుపార్టీ 1 నూతన ఆంధ్ర శాసన సభలో స్త్రీ సభ్యురాండ్రసంఖ్య 3. ఐక్యకాంగ్రెస్ 2, ప్రజాసోషలిస్టు 1.

ప్రజాసోషలిస్టుపార్టీ తరఫున గజపతి నగరం ద్విసభ్యనియోజకవర్గంనుండి ఎన్నికైన విజయనగరం రాణి శ్రీమతి కుసుంగజపతిరాజుతో, పోటీచేసిన అభ్యర్థులందరికీ ధరావతులు పోవటం ఒక విశేషమనే చెప్పాలి.

ఈ ఎన్నికలలో పోటీ చేసిన అభ్యర్థులందరిలోను అత్యధిక ఓట్లు సంపాదించిన గౌరవము, ప్రతిష్ట "దివి" ద్విసభ్యపు యోజకవర్గంలోని కాంగ్రెస్ కూటమి అభ్యర్థి శ్రీ మల్లెపూడి రాజేశ్వరరావుకి దక్కుతోంది. వీరికి పోలైనఓట్లు 61,128.

ఆంధ్ర శాసనసభలోని 29 ద్విసభ్య నియోజకవర్గాలలోను, అన్నిటికన్నా ఎక్కువఓట్లు పోలైన ద్విసభ్య నియోజకవర్గం కృష్ణాజిల్లా "దివి" ఇక్కడ మొత్తం పోలైన ఓట్లు 1,19,502. ఆంధ్రలో యిన్ని తడవలు ఎన్నికలు జరిగినప్పటికి కొండజాతిప్రజలు ఎన్నికలలో పాల్గొని తద్వారా ప్రజాస్వామ్య ప్రభుత్వస్థాపన యందుగల తమ బాధ్యతను యింకా తగినవిధంగా గుర్తించలేదనే విషయం ఈ క్రింద

పొందుపర్చిన సంగతులవలన మనకు విశదమవుతుంది. కొండ జాతులకు ప్రత్యేకించిన ఐదు (నాగూరు, సాలూరు, శృంగవరపు కోట, గూడెం, భద్రాచలం) నియోజకవర్గాలలో చాలాతక్కువఓట్లు పోలైనాయి. ముఖ్యంగా గూడెం నియోజకవర్గంలో 76,000 ఓట్లు ఉండగా 6,000 మాత్రమే పోలైనవి. ఈ ఐదుస్థానాలుపార్టీ వారీగా కాంగ్రెస్ 1, ప్రజాసోషలిస్టు 1, కమ్యూనిస్టు 1, స్వతంత్రులు 2 సంపాదించుకొన్నారు.

ఈ ఎన్నికలలో కాంగ్రెస్ కమ్యూనిస్టు ముఖాముఖి పోటీలు రమారమి 70 నియోజకవర్గాలలో జరిగింది. ఈ పోటీలలో ముఖ్యమైన నియోజకవర్గాలు దివి, గన్నవరం, పుట్లూరు, ఒంగోలు వగైరా ప్రదేశాలు. సత్తెనపల్లి, నందిగామ, వుయ్యూరు, తిరువూరు, కూచనపూడి, మాడుగుల మొదలగుచోట్ల కూడా పోటీ చాలా తీవ్రంగా జరిగిందనే చెప్పాలి.

ఆంధ్ర ఎన్నికల రంగమంతటిలోను అత్యంత ప్రముఖపాత్ర నిర్వహించిన నియోజకవర్గం "దివి", ఇక్కడ పోటీ పార్టీలకంటే వ్యక్తులమధ్య జరిగింది, పార్టీ గౌరవంకన్నా వ్యక్తి ప్రతిష్ట కోసం ఎక్కువ ప్రయత్నించారు. ఐక్యకాంగ్రెస్ అభ్యర్థి శ్రీ రాజా యార్లగడ్డ శివరామప్రసాద్ బహద్దర్, కమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు శ్రీ చండ్ర రాజేశ్వరరావు మీద 17,41 ఓట్ల తేడాతో గెలుపొందారు.

ఈ ఎన్నికలలో కమ్యూనిస్టు పార్టీ పోటీచేసిన 169 స్థానాలలోను 15 మాత్రమే సంపాదించుకో గలిగారు. పార్టీ నాయకులలో శ్రీ పుచ్చలపల్లి సుందరయ్య, శ్రీ పిల్లలమఱ్ఱి వెంకటేశ్వర్లు, ప్రభృతులు విజయ మొంది శ్రీ మాకినేని బసవపున్నయ్య, శ్రీ మోటూరి హనుమంతరావు శ్రీ తరిమెల నాగిరెడ్డి ఓడిపోయారు. తరువాత ప్రజాసోషలిస్టుపార్టీ 41 స్థానములకు మాత్రమే పోటీచేసి 13 స్థానములు గెలుచుకొన్నారు. ఆపార్టీ ప్రముఖులలో శ్రీ నడింపల్లి వెంకటలక్ష్మీనరసింహారావు, శ్రీ నాయకంటి శంకరరెడ్డి పరాజయం పొందారు. ఐక్యకాంగ్రెస్ వారు 188స్థానములకుపోటీచేయగా 146 స్థానములు సంపాదించుకో గలిగారు. శ్రీ తెన్నేటి విశ్వనాథం మినహా ఈ పార్టీకి చెందిన

ప్రముఖులంతా నెగ్గారనే చెప్పాలి. స్వతంత్రి అభ్యర్థులు 170 పోటీచేసి 22 మాత్రమే సంపాదించగలిగారు. భారతీయ జనసంఘం అభ్యర్థులుగా పోటీచేసిన ఆరుగురు డిపాజిట్లు కోల్పోయారు. అయినప్పటికీ ప్రతిపక్షాలు ఎన్నికలలో ఓడిపోయినామనే నిరాశను, నిస్పృహను, వదిలి, ద్విగుణీకృతోత్సాహంతో తమ తమ పార్టీల ఆశయాలను, ఆదర్శాలను ప్రజలకు బాగా అర్థమయ్యేరీతిగా నచ్చచెప్పి, ఎవరికి వారు స్వతంత్రంగా సుస్థిరప్రభుత్వాన్ని ఏర్పరచగల స్తోమత సంపాదించాలి. యిదే విధంగా ప్రభుత్వాధిపత్యం చేపట్టిన పార్టీ కూడా విజయగర్వంలో విఱ్ఱవీగుతూ, కర్తవ్యాలను, కాలదన్ని ప్రజలకు దూరం కాకుండా ప్రతిపక్షాల ధాటికి తట్టుకొనేలాగు తమలోఉన్న విభేధాలను, వైషమ్యాలను విస్మరించి పార్టీ కోటను మరింత పటిష్టం చేసుకోవాలి.

ఐక్య కాంగ్రెస్ అభ్యర్థులలో తిరిగి పార్టీలవారీగా కాంగ్రెస్ 119, కృషిక్‌లోక్ పార్టీ 22, ప్రజాపార్టీ 5, ఎన్నికైనారు. ఆంధ్రశాసనసభలోని వివిధపార్టీల, స్వతంత్రుల బలాబలాలు ఈ విధంగా ఉంటాయి. ఐక్య కాంగ్రెస్ 146, కమ్యూనిస్టు 15, ప్రజా సోషలిస్టు 13, మరియు స్వతంత్రులు 22, కాని ఈసందర్భములో ఏపార్టీ అయినప్పటికి, శాసనసభలో సంపాదించిన స్థానాలనుబట్టి ఆ యా పార్టీలపై ఆంధ్రప్రజలకుగల అభిమానం క్షీణించిందనికాని, యినుమడించిందనికాని చెప్పటం సమంజసం కాదనే విషయం గుర్తించవలసి ఉన్నది.

అన్నిపార్టీలకన్నా అత్యధిక స్థానాలు గెలుచుకొని ప్రభుత్వాధిపత్యమును స్వీకరించ అర్హత సంపాదించిన ఐక్య కాంగ్రెస్‌వారు విజయవాడలో సమావేశమై గా॥ శ్రీ బెజవాడ గోపాలరెడ్డిని ఐక్య కాంగ్రెస్ శాసనసభా నాయకుడుగా ఏకగ్రీవంగా ఎన్నుకున్నారు. తదుపరి శ్రీ గోపాలరెడ్డిని ఆంధ్ర గవర్నరు శ్రీ చందూలాల్ మాధవలాల్ త్రివేది ఆహ్వానించి, మంత్రివర్గం ఏర్పరచి ప్రభుత్వాధిపత్యమును స్వీకరించవలసినదిగా కోరిరి. ఆహ్వానము నంగీకరించి శ్రీగోపాలరెడ్డి మంత్రిమండలి

నేర్పరచి, మార్చి నెల 28వ తేదీన ప్రమాణ స్వీకారము నొందిరి. దీనితో నాలుగు మాసముల పదిహేను రోజుల అనంతరం ఆంధ్రరాష్ట్రములో తిరిగి ప్రజాస్వామిక ప్రభుత్వము ఏర్పడి, గవర్నరు పరిపాలన అంత మొందినది.

ఆంధ్ర శాసనసభ తొలి సమావేశంలో ఐక్య కాంగ్రెస్ అభ్యర్థులు శ్రీ రొక్కం లక్ష్మీనరసింహం దొర, శ్రీ కల్లూరి సుబ్బారావు గార్లు, వరుసగా ఆంధ్ర శాసనసభకు అధ్యక్షుడు, ఉపాధ్యక్షులుగా ఎన్నుకోబడిరి.

బహుస్వల్ప వ్యవధిలో అత్యంత సమర్థతతో నిష్పాక్షికముగా ఎన్నికలు జరిపించి, వివిధపార్టీల ప్రశంసలను లోక్ సభ వారి మన్ననలను పొందిన మన ఆంధ్ర గవర్నరును, వారికి ప్రతి విషయములోను సహాయ మొనర్చిన ఎన్నికల సిబ్బందిని, ఈ శుభ సమయమున మనము అభినందించవలసిన అవసరము ఎంతైనా గలదు. భాషా రాష్ట్ర సిద్ధాంతముపై భారత రిపబ్లిక్ లో ప్రప్రథమముగా ఏర్పడిన ఆంధ్ర రాష్ట్రములో శాసనసభకు జరిగిన తొలిఎన్నికలు ప్రశాంతంగా జరిగినవనే చెప్పాలి. దీనికి కారకులైన వివిధ పార్టీలు, ప్రభుత్వాధినేతలు, ప్రజలు, పత్రికలు, అభినందనీయులు.

సమస్త బాలవ్యాధులకు ప్రత్యేకవైద్యులు

డాక్టరు

పిళ్లా వెంకటరమణయ్యపాత్రుడు



## శిశుజ్యోతి

లివర్ & స్ప్లీన్‌వ్యాధులకు దివ్యౌషధం

## మధుపూర్ణ

తల్లిపాలను వృద్ధిచేయు టానిక్

వివరములకు :

బాలరోగనివారణాలయం

కొత్తపేట, విజయవాడ-1

## అడ్వర్ టైజుమెంటు

భారీ ఉత్పత్తి అభివృద్ధికి పొదుపరి, అమ్మకమునకు తోడ్పడును.

ధరలను తగ్గించును.



మీ వస్తు ప్రచారమునకు, అమ్మకమునకు ఎల్లప్పుడు సహాయమొనర్చి, మీ వ్యాపారమును, విజయవంతమొనర్చును



ప్రచార సాధనమువలన మీ పరిశ్రమ అభివృద్ధి పొందును, కొనుగోలుదార్లు అధికమగుదురు.

నాణ్యము, పరిమాణము, ధర, విచక్షణా రహితముగా మీ వస్తువులు ప్రజలందరి అందుబాటులో ఉండునట్లు సహాయపడును.



మీ ఉత్పత్తి విక్రయ విధానమందలి వివిధ సమస్యలు, తీర్పుటకు, మా తోడ్పాటు ఎల్లప్పుడు లభించును.

వివరములకు :

యస్. సత్యనారాయణరావు

అడ్వర్ టైజింగ్ ఏజంటు

5వ లైను,

అరండల్ పేట - గుంటూరు. 2.

# శ్రీకాకుళం జిల్లా

## రొక్కం లక్ష్మీనరసింహదొర

కాంగ్రెస్ : టెక్కలి, నియోజకవర్గం వయస్సు : 66 సం॥, విద్య : న్యాయవాద పట్టభద్రుడు 1925 న్యాయవాదవృత్తి, శ్రీకాకుళంజిల్లా బార్ అసోసియేషన్ అధ్యక్షుడు, ఇదివరలో గంజాంజిల్లా బోర్డు సభ్యుడు, ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెటుసభ్యుడు, శ్రీకాకుళం కోపరేటివ్ సెంట్రల్ బ్యాంకు సలహాసంఘం అధ్యక్షుడు, 1952 ఎన్నికలలో స్వతంత్రఅభ్యర్థిగా మద్రాసు శాసనసభకు ఎన్నిక, కుప్పుస్వామి ప్రాథమిక విద్యావిచారణసంఘంలో, దేవాదాయ ధర్మాదాయ కమిటీలో, భూసంస్కరణల కమిటీలో సభ్యుడు, ప్రస్తుతం ఆంధ్ర శాసనసభాధ్యక్షుడు, అడ్రసు: కురుదు, కొత్తపల్లిపోష్టు.



## గౌతు లచ్చన్న

కాంగ్రెస్ : సోంపేట నియోజకవర్గం, జననం : 16-8-1909, విద్య : స్కూలు ఫైనలు, 1930-31 లో ఉప్పు, కల్లు సత్యాగ్రహోద్యమాలలో కార్యకర్త, 1937 లో ఇచ్ఛాపురంలో రైతు విద్యాలయ నిర్వహణ, 1940 లో పలాసాలో జరిగిన అఖిలభారత కిసాన్ కాంగ్రెస్ మహాసభకు ఆహ్వాన సంఘాధ్యక్షుడు. దానిని నిషేధించినతరువాత 1940-43 వరకు అజ్ఞాతవాసం, 1942-45 డిటెన్యూ, 1946-50 వరకు ప్రదేశ్ కాంగ్రెస్ సహాయ కార్యదర్శి, 1948-52 లో మద్రాసు శాసన సభాసభ్యుడు, 1952 ఎన్నికలకు పూర్వం రంగా తదితరులతో కలసి కాంగ్రెస్ నుండి నిష్క్రమణం, ఆంధ్రరాష్ట్ర ప్రథమమంత్రివర్గంలో 61 రోజులు వ్యవసాయ శాఖామంత్రి ప్రస్తుత మంత్రివర్గంలో సభ్యుడు, ప్రత్యేకఅభిమానం : గీతకార్మికుల సముద్ధరణ, అడ్రస్సు : బారువ, సోంపేటతాలూకా, శ్రీకాకుళంజిల్లా.



## ఉప్పాడ రంగబాబు

కాంగ్రెస్ : ఇచ్ఛాపురం నియోజకవర్గం, జననం: 9-10-1925, విద్య: ఇంటర్మీడియట్, 1942 లో రాజకీయాలలో ప్రవేశం, 1950 వరకు ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడు, తరువాత ప్రజాపార్టీలోను, లోక్ పార్టీలోను సభ్యుడు, జిల్లా ప్రొహిబిషన్ కమిటీలోను, ప్లానింగుకమిటీలోను సభ్యుడు, అడ్రస్సు: ఇచ్ఛాపురం.



## లుకలాపు లక్ష్మణదాసు

కాంగ్రెస్ : పాతపట్నం (జనరల్) నియోజకవర్గం, జననం : 1916, విద్య : బి. కాం., 1939లో ఆంధ్ర విశ్వవిద్యాలయ విద్యార్థిసంఘ ప్రధాన కార్యదర్శి, 1942 లో కాంగ్రెస్ ఉద్యమములో ప్రవేశం, 1948 శ్రీకాకుళం కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు



డైరెక్టరు, 1949-53 సెంట్రల్ బ్యాంకి ఉపాధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్ర రైతు కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సహాయ కార్యదర్శి, 1950 లో జిల్లాబోర్డు మెంబరు, రాష్ట్ర హరిజన సేవా సంఘ కార్యవర్గసభ్యుడు, 1952 లో అవిభక్త మద్రాసురాష్ట్ర శాసనసభలో సభ్యుడు, ప్రత్యేక అభిమానం : విద్యాభివృద్ధి, రైతుఉద్యమము, సహకారఉద్యమము, అడ్రెస్సు : కొమ్మనరియాపల్లి, శ్రీకాకుళంజిల్లా.

## పోతుల గున్నయ్య

కాంగ్రెస్ : పాతపట్నం (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు : 47, విద్య : 3వ ఫారం, తాలూకా, జిల్లా, కాంగ్రెస్ సభ్యుడు, తాలూకా హరిజన సంఘాధ్యక్షుడు, జిల్లా బోర్డు సభ్యుడు, జిల్లా హరిజన సంక్షేమ సంఘసభ్యుడు, రాష్ట్ర వ్యవసాయ



కూలీ కార్యాచరణ సంఘసభ్యుడు, 1952 లో మద్రాసు శాసనసభలో సభ్యుడు, ప్రత్యేక అభిమానం:దినపత్రికలు, అడ్రెస్సు: చిన్నబొండపల్లి, పార్వతీపురంపోష్టు శ్రీకాకుళంజిల్లా.

## కోటగిరి సీతారామస్వామి

కాంగ్రెస్ : బొబ్బిలి నియోజకవర్గం, జననం : 1904, విద్య : స్కూలుఫైనలు, 1932 లో రాజకీయ ప్రవేశం వెంటనే జైలుశిక్ష, 1938-42 విశాఖపట్టణం జిల్లా బోర్డు ఉపాధ్యక్షుడు, 1950-53 వరకు శ్రీకాకుళం జిల్లాబోర్డు ఉపాధ్యక్షుడు, విశాఖపట్టణంజిల్లా విద్యాసంఘసభ్యుడు, శ్రీకాకుళం జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, విజయనగరం సెంట్రల్ బ్యాంకి ఉపాధ్యక్షుడు, ప్రత్యేక అభిమానం : సహకారోద్యమం, అడ్రెస్సు : వెలమవీధి, బొబ్బిలి, శ్రీకాకుళంజిల్లా.



## చౌదరి సత్యనారాయణ

కాంగ్రెస్ : షేర్‌మహమ్మద్‌పురం, నియోజకవర్గం, జననం : 10-6-1910, విద్య : 4వ ఫారం, 1940 లో వ్యక్తి సత్యాగ్రహంలో జైలుశిక్ష, 1942 ఉద్యమములో అజ్ఞాతవాసం, 1951 లో కాంగ్రెస్‌నుండి రాజీనామా, తాలూకా లోక్‌పార్టీ ప్రధాన



## అల్లు ఎరుకనాయుడు

ప్రజాసోషలిస్టు : సాలూరు ( జనరల్ ) నియోజకవర్గం, జననం : 1914, విద్య : ఇంటర్మీడియట్ 15సం|| క్రిందట రాజకీయరంగ ప్రవేశం, సాలూరు తాలూకా రైతుసంఘ కార్యదర్శి, 1941 - 50 సాలూరు పంచాయితీబోర్డు అధ్యక్షుడు, జిల్లా ఇరిగేషన్ కమిటీ సభ్యుడు, సాలూరు పురపాలకసంఘ సభ్యుడు. ప్రత్యేకఅభిమానం: నీటిపారుదలస్కీములు, హరిజనాభ్యుదయము. అడ్రస్సు : నాయుడువీధి, సాలూరు, శ్రీకాకుళంజిల్లా.



## బోయిన రాజయ్య

కాంగ్రెసు : సాలూరు ( రిజర్వుడు ) నియోజకవర్గం, జననం : 1-7-1915, విద్య : యస్.యస్.యల్.సి. 2 సం||లు తాలూకా కాంగ్రెస్ సంఘ సభ్యుడు, ప్రాథమికోపాధ్యాయుల జీవన ప్రమాణాభివృద్ధికై కృషి. ప్రత్యేక అభిమానం : సాలూరు తాలూకాలోని షెడ్యూల్డుతరగతుల అభివృద్ధికికృషి. అడ్రస్సు : జమిడవలస, సాలూరుతాలూకా శ్రీకాకుళంజిల్లా.



## సిమ్మా జగన్నాధం

కాంగ్రెసు : నరసన్నపేట, నియోజకవర్గం, జననం, 1922 విద్య: బి. ఎ. బి. యల్ 1950లో సోషలిస్టుగా రాజకీయ జీవితం ప్రారంభించి 51లో లోక్ పార్టీలో ప్రవేశం శ్రీకాకుళం జిల్లా కిడ్ కాంగ్రెస్ సంఘ సంయుక్త కార్యదర్శి శ్రీకాకుళం హిందీ ప్రేమీమండలి కార్యదర్శి శ్రీకాకుళం మోటారు కార్మికుల సంఘ అధ్యక్షుడు ప్రత్యేక అభిమానం: ప్రజాసేవ, అడ్రస్సు అడ్వకేటు, శ్రీకాకుళం.

## పైడి నరసింహఅప్పారావు

స్వతంత్ర : పాలకొండ నియోజకవర్గం, జననం : 1908, విద్య : యస్. యస్. యల్. సి. 1922 నుండి కాంగ్రెసువాది, 1936 విశాఖజిల్లా రైతు సంఘ కార్యదర్శి, 1937 తాలూకా కాంగ్రెసు సంఘానికి మూడు సం||లు అధ్యక్షుడు, కార్యాచరణ సంఘసభ్యుడు, 1937-54 రాష్ట్ర కాంగ్రెసుసభ్యుడు, 1951-54 లో అఖిల భారత కాంగ్రెసు సంఘసభ్యుడు, 1950-53 జిల్లాబోర్డు సభ్యుడు, 1950 నుండి విజయనగరం సెంట్రల్ స్టోర్సు ఉపాధ్యక్షుడు, 1954 డిశంబరువరకు జిల్లా కాంగ్రెసు కార్యాచరణ సంఘసభ్యుడు, సంయుక్త కార్యదర్శి, ఎన్నికలముందర కాంగ్రెసునుండి వైదొలగుట. ప్రత్యేకఅభిమానం : జాతీయపరిశ్రమలు. అడ్రస్సు : పాలకొండ, శ్రీకాకుళంజిల్లా.



## తమ్మినేని పాపారావు

స్వతంత్ర, నగరి కటకం, నియోజక వర్గం, జననం: 16-4-1916 గాంధీ హరిజన సేవా సంఘ సభ్యుడు, 1934లో జిల్లా రాష్ట్ర కాంగ్రెసు సభ్యుడు, 1950 జిల్లా కాంగ్రెసు సంఘ అధ్యక్షుడు, 1953-54 జిల్లా కాంగ్రెసు సంఘ ప్రధాన కార్యదర్శి, శ్రీకాకుళం జిల్లా సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంక్, ఆంధ్రాస్టేటు సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకి డైరెక్టరు. ప్రత్యేక అభిమానం: రైతు సమస్యలు అడ్రస్సు: తొగరం, పోస్టు శ్రీకాకుళం జిల్లా

## పసగాడ సూర్యనారాయణ

స్వతంత్ర: శ్రీకాకుళం నియోజక వర్గం, వయస్సు: 48, విద్య: 5వ ఫారం, 12 సం||లు శ్రీకాకుళం కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి డైరెక్టరు, 10 సం||లు శ్రీకాకుళం పురపాలక సంఘ సభ్యుడు. ప్రత్యేక అభిమానం: కార్మిక శ్రేయస్సు. అడ్రస్సు: శ్రీకాకుళం.



## వైరిచర్ల చంద్రచూడామణిదేవ్

స్వతంత్ర: పార్వతీపురం, నియోజక వర్గం, కురుప్పంరాజా 1952 ఎన్నికలలో ఉమ్మడి మద్రాసు శాసన సభకు కాంగ్రెస్ అభ్యర్థిగా కురుప్పం నియోజక వర్గం నుండి ఎన్నిక, అడ్రస్సు: పట్టాయల్ కురుప్పం పోస్టు, పార్వతీపురం తాలూకా

## ముదుండి సత్యనారాయణరాజు

ప్రజాసోషలిస్టు: చీపురుపల్లి (జనరల్) నియోజకవర్గం, జననం: 5-6-1907, విద్య: బి. యస్. సి. పంచ పంచదారఫ్యాక్టరీ మేనేజరు ఉద్యోగానికి రాజీనామా యిచ్చి రాజకీయాలలో ప్రవేశించి కార్మిక హక్కులకు కృషి. ప్రత్యేక అభిమానం: పరిశ్రమాభివృద్ధి, కార్మికాభ్యుదయం, అడ్రస్సు: మెరకముడిదాం, చీపురుపల్లితాలూకా, శ్రీకాకుళంజిల్లా.



## కొత్తపల్లి పున్నయ్య

కాంగ్రెసు: చీపురుపల్లి (రిజర్వుడు) నియోజకవర్గం, జననం, 1924 విద్య: బి. యల్ 1945 48 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు కమిటీ సభ్యుడు, 48 - 50 కార్య నిర్వాహకవర్గ సభ్యుడు, 1942 క్విట్ ఇండియా ఉద్యమములోను, 1950 సాంపేట తాలూకా హరిజనుల భూవిహక్కుల రక్షణ విషయములో 6 రోజులు జైలుశిక్ష, ఇదివరలో విశాఖజిల్లా విద్యార్థి కాంగ్రెసు కార్యదర్శి, ఉత్తర విశాఖజిల్లా కాంగ్రెసు సహాయకార్యదర్శి. ప్రత్యేకఅభిమానం: హరిజనోద్ధరణ సంఘసేవ. అడ్రస్సు: చీపురుపల్లి.



## అడ్డాకుల లక్ష్మీనాయుడు

స్వతంత్ర : నాగూరు నియోజకవర్గం, వయస్సు:45 సం॥లు, 10 సం॥లుగా శ్రీకాకుళంజిల్లాలో అనేక సంఘాలు స్థాపించి, అందరి కొండ జాతులవారి అభివృద్ధికై నిరంతరకృషి ప్రత్యేకఅభిమానం : వెనకబడిన జాతుల ఉద్ధరణ. అడ్రస్సు: తాడికొండ, గుమ్మలక్ష్మీపురంపోస్టు.



## పెద్దింటి రామస్వామినాయుడు

కాంగ్రెసు : బలిజిపేట నియోజకవర్గం, జననం : 31-12-190, విద్య : యం.ఏ. (ఆనర్సు) 1945 నుండి కాంగ్రెసు సభ్యుడు, బొబ్బిలి తాలూకా కాంగ్రెసు అధ్యక్షుడు, శ్రీకాకుళంజిల్లా కాంగ్రెసు ఉపాధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు సభ్యుడు, బొబ్బిలితాలూకా చెరుకుపంటదారుల సంఘము అధ్యక్షుడు, ఆంధ్రవిశ్వవిద్యాలయం సెనెట్ సభ్యుడు, ఇదివరలో ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గ సభ్యుడు. ప్రత్యేకఅభిమానం : సారస్వతము, గ్రంధరచన. కర్షకచక్రవర్తి (పద్యకావ్యము) అప్పకవీయ విషయపరిశోధన, శ్రీనాధుని కళాప్రావీణ్యము, గ్రంథకర్త. అడ్రస్సు : పిరిడిపోస్టు, బొబ్బిలితాలూకా.



## నిచ్చర్ల రాములు

కాంగ్రెస్: బ్రాహ్మణతర్ల, నియోజకవర్గం, జననం, 1925 సంవత్సరము విద్య : ఇంటర్ మీడియట్ 1942లో రాజకీయాలలో ప్రవేశం, 1947లో పలాసాలో నడప బడిన ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసు సేవాదళ ఆహ్వాన సంఘ కార్యదర్శి తాలూకా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి 1945-51 వరకు జిల్లా కాంగ్రెస్ సభ్యుడు తరువాత కృషికార్ లోక్ పార్టీ టెక్కలి తాలూకా కార్యదర్శి 1945-53 సహకార పరపతి సంఘం, సహకార విక్రయ సంఘం డైరక్టరు 1953 నుండి పలాసా మేజరు పంచాయితీ అధ్యక్షుడు ప్రత్యేకాభిమానం సాంఘిక సేవ, అడ్రస్సు: పలాస.

## చెలికాని శ్రీరంగనాయకులు

కాంగ్రెసు : వుణుకూరు నియోజకవర్గం, జననం: 28-1-1900, విద్య : బి.ఏ. బి.యల్., 1924 సం॥ నుండి న్యాయవాదవృత్తి, 1952 రాజాం బార్ అసోసియేషన్ అధ్యక్షుడు. 1932-34వరకు పాలకొండ తాలూకా బోర్డు అధ్యక్షుడు, 1935-38 బొబ్బిలిజిల్లాబోర్డు అధ్యక్షుడు, ఇదివరలో విశాఖపట్టణం జిల్లాబోర్డులోను, విశాఖజిల్లా విద్యాసమితిలోను సభ్యుడు, రాజాం సత్యనారాయణ కోఆపరేటివ్ స్టోర్సు, హైస్కూలుకమిటీ, జాగ్రి కారసేమన్ క్లబ్బుకు అధ్యక్షుడు. ప్రత్యేకఅభిమానం : గ్రామసీమల పునర్నిర్మాణం. అడ్రస్సు : రాజాం.



# విశాఖ జిల్లా

## ఈటి నాగయ్య

కాంగ్రెస్ : పరవాడ, నియోజకవర్గం



జననం: 8-11-1907 విద్య, తెలుగు, ఇంగ్లీషు 20 సం॥ లుగా కాంగ్రెస్ సభ్యుడు, 1932 విశాఖతాలూకాబోర్డు అధ్యక్షుడు, జిల్లా బోర్డు మెంబరు. మున్సిపల్ కౌన్సిలర్, విశాఖతాలూకా కాంగ్రెస్ ప్రెసిడెంటు ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ సభ్యుడు ప్రత్యేక అభిమానం : రైతుఉద్యమము, అడ్రస్సు : 16/220 వార్డు, వడవీధి, విశాఖపట్నం.

## బీసెట్టి అప్పారావు

కాంగ్రెస్: అనకాపల్లి, నియోజకవర్గం,



వయస్సు : 42 సం॥ విద్య, మూడవ ఫారం కొంతకాలం జమషెద్ పూర్ తాతా ఫ్యాక్టరీలో ఉద్యోగం. 7 సంవత్సరములు ట్రేడ్ యూనియన్ కార్యకర్త, గీత సత్యాగ్రహంలో జైలుశిక్ష, ప్రత్యేక అభిమానం: కార్మికసంఘాలు, అడ్రస్సు గవరపాలెం, అనకాపల్లి.

## మజ్జి పైడయ్యనాయుడు

కాంగ్రెస్ : కొండకర్ల, నియోజకవర్గం,



వయస్సు : 45 సం॥ విద్య, రెండవఫారం 1921 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 16 సం॥ లు కాసింకోట ఆస్థాన రెవెన్యూ ఇన్స్పెక్టరుగా నౌకరి. ప్రత్యేక అభిమానం: భూ సంస్కరణలు, అడ్రస్సు : నరసింగపల్లి, అనకాపల్లితాలూకా.

## రాజసాగి సూర్యనారాయణరాజు

కాంగ్రెస్ : నర్సీపట్నం (జనరల్)



నియోజకవర్గం, జననం : 1-11-1903 విద్య, 5వ ఫారం, 1921 కాంగ్రెస్‌లో ప్రవేశం, 1932 తాలూకా బోర్డు మెంబరు. 1942 వరకు జిల్లా కాంగ్రెస్ కమిటీ మెంబరు. 1952 ఎన్నికలలో మదాసు

శాసనసభకు స్వతంత్ర అభ్యర్థిగా ఎన్నిక, 1954 మే నెలలో ఆస్థానకవి శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారి శ్రీకృష్ణ భాగవతము కృతిస్వీకరణ, ప్రత్యేక అభిమానం: దైవభక్తి, అడ్రస్సు : తంగేడు, ఉరట్ల, పోష్టు.

## ముత్యాల పోతురాజు

కాంగ్రెస్ : నర్సీపట్నం (రిజర్వుడు) నియోజకవర్గం,



వయస్సు : 45 సం॥ విద్య : 8 వ తరగతి, 1921 కాంగ్రెస్‌లో ప్రవేశించి, హరిజనుల విద్యాభివృద్ధి, అస్పృశ్యతా నివారణకు కృషి, తాలూకా హరిజన సంఘం ప్రెసిడెంటు, పట్టణ కాంగ్రెస్, ఎడ్యుకేషన్ కమిటీ, పంచాయితీబోర్డు, మెంబరు, ప్రత్యేక అభిమానం : గాంధీగారి ఆశయ ఆచరణ, అడ్రస్సు : నర్సీపట్నం, గొలుగొండ, తాలూకా.

## గుజ్జల రామునాయుడు.

ప్రజా సోషలిస్టు : శృంగవరపుకోట; రిజర్వుడు, నియోజకవర్గం



జననం : 1901 అధ్యక్షుడు, అనంతగిరి కో ఆపరేటివ్ సొసైటీ, సభ్యుడు ఏజన్సీ డెవలప్‌మెంటుబోర్డుప్రత్యేక అభిమానం : వ్యవసాయము, వేట, అడ్రస్సు : శృంగవరపుకోట, పోష్టు.

## బి. జి యం. ఎ. నరసింగరావు

కాంగ్రెస్ : కణితి; నియోజకవర్గం జననం, 17-11-1928 విద్య, ఇంటర్‌మీడియట్ 1942 లో కాలేజీ విడిచి ఆగష్టు ఉద్యమములో పాల్గొన్నందుకు. అజ్ఞాతంగా విద్యార్థి సంఘాలను నడుపుతున్నందుకు అరెస్టు, ఆంధ్ర ప్రభుత్వ కార్మిక



సలహా సంఘము. కనీస వేతన సలహా సంఘము స్టేటు ఇన్సూరెన్సు సలహా సంఘములలో సభ్యుడు, 18-4-55 వెంకటేశ్వర విశ్వవిద్యాలయ సెనెట్‌కు విశాఖ జిల్లా స్థానిక సంస్థల నియోజకవర్గమండి ఎన్నిక ఇండియన్ నేషనల్ ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్ (ఆంధ్రశాఖ) కార్యదర్శి. విశాఖపట్టణం ఎలక్ట్రిక్ సప్లయి కార్పొరేషన్ ఎంప్లాయిస్ యూనియన్. డాక్‌వర్కర్సు యూనియన్. అనకాపల్లి ఎలక్ట్రిక్ సప్లయికార్పొరేషన్ ఎంప్లాయిస్ యూనియన్. ఆంధ్రరాష్ట్ర ఎలక్ట్రిక్ పనివారలసంఘం, శ్రీకృష్ణాసాల్టు వర్కర్సుయూనియన్, పోర్టుకలాసీ యూనియన్, ఈస్టరన్ రైల్వే పోర్టర్సు యూనియన్ ఇంకా అనేక కార్మిక సంఘాలకు అధ్యక్షుడు, ప్రత్యేక అభిమానం : కార్మిక సంఘాలు, అడ్రస్సు : గంగులవారి వీధి, విశాఖపట్టణం, 1.

## చింతలపాటి వెంకట సూర్యనారాయణరాజు

స్వతంత్ర: ఎలమంచిలి, నియోజకవర్గం, జననం, 15-11-1901 విద్య, స్కూలు ఫైనలు, 1924-54 వరకు కాంగ్రెస్ సభ్యుడు 1934 నుండి ల్యాండు మార్టిగేజి బ్యాంక్ ప్రెసిడెంటు, 1922-52 జిల్లాబోర్డు సభ్యుడు, డెట్ కన్సిలియేషన్ బోర్డు సభ్యుడు, చెరుకు ఉత్పత్తిదార్ల సంఘం (ఆంధ్ర) ఉపాధ్యక్షుడు. ప్రత్యేకఅభిమానం: వ్యవసాయము, అడ్రస్సు: ఏటికొప్పాక, ఎలమంచిలి, తాలూకా.



## రెడ్డి జగన్నాథంనాయుడు

స్వతంత్ర: చోడవరం, నియోజకవర్గం, వయస్సు, 49 సం॥ విద్య, 4 వ ఫారం, వేచలము గ్రామాధికారిగా ఉంటూ ఎన్నికల ముందు రాజీనామా, ఏ రాజకీయ పార్టీతోనూ సంబంధం లేదు. ప్రత్యేకఅభిమానం: వ్యవసాయము. అడ్రస్సు: వేచలము, చోడవరం, తాలూకా.



## మచ్చరాస మచ్చరాజు

స్వతంత్ర: గూడెం ఏజన్సీ, నియోజకవర్గం, జననం: 10-6-1912 విద్య, 5 వ తరగతి. ప్రత్యేకఅభిమానం: ఏజన్సీ ప్రజల అభివృద్ధి. అడ్రస్సు, మాడుగులు పోస్టు వయా, చింతపల్లి, గూడెం తాలూకా.



## గంట్లాన సూర్యనారాయణ

ప్రజాసోషలిస్టు: గజపతినగరం, (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు, 40 సంవత్సరములు విద్య, 8 వ తరగతి. కొన్నాళ్ళు షెడ్యూల్డు క్యాస్టు ఫెడరేషన్‌లోను 1948 నుండి ప్రజాసోషలిస్టు పార్టీలోను సభ్యుడు, 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు ఎన్నిక, పొట్టి శ్రీరాములుగారు చనిపోయినప్పుడు ప్రభుత్వమునకు నిరసనగా రాజీనామాయిచ్చి తిరిగి పోటీ లేకుండా ఎన్నిక, 1954 కరివేన ఈనాం రైతు సత్యాగ్రహంలో జైలుశిక్ష. ప్రత్యేకఅభిమానం: హరిజనోద్ధరణ. అడ్రస్సు, విజయనగరం.



### పి. విజయరామ గజపతిరాజు



ప్రజాసోషలిస్టు: విజయనగరం, నియోజకవర్గం, జననం, 1-5-1924. విద్య, మద్రాసు ప్రెశిడెన్సీ కాలేజీలోను, కొలంబియా యూనివర్ సిటీలోను ఉన్నత విద్యాభ్యాసం, మార్చి 1947 లో కాంగ్రెస్ సోషలిస్టు పార్టీ సభ్యుడుగా చేరిక. 18-8-54 కరివెన ఈనాంరైతు సత్యాగ్రహం లో పాల్గొని జైలుశిక్ష, ఆంధ్ర ప్రజాసోషలిస్టుపార్టీ కార్యదర్శి. ప్రత్యేకాభిమానం, స్పోర్ట్సు. అడ్రెస్సు: విజయనగరం.

### కుసుం గజపతిరాజు



ప్రజాసోషలిస్టు: గజపతినగరం, (జనరల్) నియోజకవర్గం, జననం, 6-3-1925. విద్య, బొంబాయి ఎలిఫెన్ స్టన్ కాలెజీ, 48-49 కొలంబియా యూనివర్ సిటీలోను ఉన్నత విద్యాభ్యాసం. 1951 నుండి ప్రజాసోషలిస్టు పార్టీ సభ్యురాలు. ప్రత్యేకాభిమానం: సంగీతం. అడ్రెస్సు: విజయనగరం.

### కె. వి. యస్. పద్మనాభరాజు

ప్రజాసోషలిస్టు: రేవడి, నియోజకవర్గం, జననం, 18-1-1926 విద్య, రెండవఫారం, 1949 నుండి ప్రజాసోషలిస్టుపార్టీ సభ్యుడు. కరివెన ఈనాంరైతు సత్యాగ్రహంలో జైలు శిక్ష. 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు ఎన్నిక



పొట్టి శ్రీరాములుగారు చనిపోయినప్పుడు ప్రభుత్వమునకు నిరసనగా రాజీనామా యిచ్చి తిరిగి పోటీలేకుండా ఎన్నిక. ప్రత్యేకాభిమానం: రైతు సమస్యలు. అడ్రెస్సు: అన్నమరాజుపేట, శృంగవరపుకోట తాలూకా.

### చాగంటి వెంకటసోమయాజులు

ప్రజాసోషలిస్టు: శృంగవరపుకోట (జనరల్) నియోజకవర్గం, జననం, 1914 విద్య, హైస్కూలు, 1945 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, 1946 తాలూకా కమిటీ జనరల్ సెక్రటరీగా ఎన్నిక. 1948 నుండి సోషలిస్టుపార్టీ సభ్యుడు. 1952 ఎన్నికలలో



సమిష్టి మద్రాసు రాష్ట్ర శాసనసభకు ఎన్నిక. ఆంధ్రరాష్ట్ర ఉద్యమ సందర్భములో రాజీనామా యిచ్చి, బై ఎలక్షన్ లో ప్రకాశం పంతులుగారికి స్థానం యిచ్చే ఉద్దేశ్యంతో, పోటీచేయలేదు. కరివెన ఈనాంరైతు సత్యాగ్రహంలో

పాల్గొని జైలుశిక్ష. అడ్రిస్సు: కాసప విజయనగరం.

### దొండా శ్రీరామమూర్తి



ప్రజాసోషలిస్టు: మాడుగుల, నియోజకవర్గం, జననం, 1927 విద్య, యస్. యస్. యల్. సి. రాజకీయాలలో యిదేప్రథమ ప్రవేశం, ఆంధ్ర ప్రజా సోషలిస్టుపార్టీ సభ్యుడు. అడ్రిస్సు: మాడుగుల, వడ్డాది పోష్టు.

### బొత్స ఆదినారాయణ



ప్రజాసోషలిస్టు: భోగాపురం, నియోజకవర్గం, జననం, 1924 విద్య, యస్. యస్. యల్. సి. 1942ఉద్యమములో 4 నెలలు జైలుశిక్ష. 1947 లో కాంగ్రెస్ నుండి రాజీనామా చేసి ప్రజాపార్టీలో జేరిక. జిల్లా ప్రజాసోషలిస్టుపార్టీ కార్యవర్గ సభ్యుడు. ప్రత్యేకఅభిమానం: వైద్యం. అడ్రిస్సు: దాసన్నపేట, విజయనగరం, పోస్టు.

### రుత్తల లత్సాపాత్రుడు



స్వతంత్రి: గోలుగొండ, నియోజకవర్గం, జననం:1916 విద్య: యస్.యస్. యల్. సి. 1938 నుండి ఇప్పటివరకు పంచాయితీబోర్డు ప్రెశిడెంటు, 1950–52 విశాఖ జిల్లాబోర్డు సభ్యుడు. ల్యాండ్ మార్టిగేజి బ్యాంకు అధ్యక్షుడు. 1950 వరకు కాంగ్రెస్ సభ్యుడు. ప్రత్యేకఅభిమానం: వ్యవసాయం. అడ్రిస్సు: నర్సీపట్నం.

### అంకితం వెంకట భానోజీరావు

కాంగ్రెస్: విశాఘపట్టణం, నియోజకవర్గం, అనేక సంవత్సరాలుగా విశాఖపట్టణం మునిసిపల్ ఛైర్మన్, విశాఖపట్టణం, ఎ. వి. యన్. కాలేజి అనేక ప్రజాహిత సంస్థలలో సభ్యుడు. అడ్రిస్సు: విశాఖపట్టణం.

### గొట్టిముక్కల జగన్నాధరాజు

ప్రజాసోషలిస్టు: భీముని పట్టణం, నియోజకవర్గం, జననం, 1888. విద్య, బి. ఎ. బి. యల్. 17 సం॥ లు జిల్లాబోర్డు అధ్యక్షుడు, 4 సం॥ లు మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ ఉపాధ్యక్షుడు. 10 సం॥ లు జిల్లా ఎడ్యుకేషన్ కౌన్సిల్ అధ్యక్షుడు, యుద్ధానంతర పునర్ నిర్మాణ సంఘం, సభ్యుడు. అడ్రిస్సు: డాబాగార్డెన్సు, విశాఖపట్నం.

# ఆంధ్ర బ్యాంకు లిమిటెడ్

స్థాపితం-1923 (షెడ్యూల్డుబ్యాంకు) హెడ్డాఫీసు – మచిలీపట్టణము.

| | |
|---|---|
| చెల్లింపబడిన మూలధనము, రిజర్వులు (15-4-1955 నాటికి) | ... రు. 45, 22, 660 |
| డిపాజిట్లు ... | ... రు. 7,00,00,000 మించినవి. |
| అమలునందున్న వ్యాపారము | ... రు. 8,00,00,000 మించినది. |

కర్నూలు ఆఫీసులు

1. 1/9 మెయిన్‌బజారు, పేట
2. లెజిస్లేచరు సెక్రిటేరియట్ భవనము (ఈ పే ఆఫీసు అసెంబ్లీ సెషన్సు జరుగుచున్నంత కాలము తెరచియుంచబడును.)

మదరాసులోని శాఖలు

1. 322-23 లింగిచెట్టి వీధి, మద్రాసు 1.
2. 77 కచేరీరోడ్డు, మైలాపూరు మద్రాసు 4.
3. 81 పాండిబజారు, త్యాగరాయనగర్, మద్రాసు 17.

ఇతరబ్రాంచీలు, సబ్ ఆఫీసులు

ఆమదాలవలస (శ్రీకాకుళంజిల్లా,) అమలాపురం, అనకాపల్లి, అనంతపురం, బళ్లారి, బాపట్ల, భట్టిప్రోలు (గుంటూరుజిల్లా,) భీమవరం, బొబ్బిలి, చల్లపల్లి (కృష్ణాజిల్లా,) చీరాల, చోడవరం (విశాఖపట్టణంజిల్లా,) కడప, దుగ్గిరాల, ఏలూరు, గొల్లప్రోలు, గుడివాడ, గూడూరు (నెల్లూరుజిల్లా,) గుంటూరు, అరండల్ పేట (గుంటూరు,) ఇచ్ఛాపురం (శ్రీకాకుళంజిల్లా,) జగ్గయ్యపేట (కృష్ణాజిల్లా, కాకినాడ, రామారావుపేట (కాకినాడ,) కొవ్వూరు (ప. గో. జిల్లా,) మచిలీపట్టణము, నరసన్నపేట (శ్రీకాకుళంజిల్లా,) నరసారావుపేట, నెల్లూరు, నిడదవోలు, ఒంగోలు, పాలకొల్లు, పామర్రు (కృష్ణాజిల్లా,) పార్వతీపురం, పెడన (కృష్ణాజిల్లా,) పెద్దాపురం, పెనుగొండ (ప. గో. జిల్లా,) పిఠాపురం, రాజమండ్రి, సాలూరు, సామర్లకోట, శ్రీకాకుళం, తణుకు, తెనాలి, కొత్తపేట (తెనాలి,) తిరుపతి, తుని, విజయవాడ, గాంధినగర్ (విజయవాడ,) గవర్నరుపేట (విజయవాడ,) వినుకొండ, విశాఖపట్టణము, మహారాణిపేట (విశాఖపట్టణము,) విజయనగరము సిటీ, వుయ్యూరు.

లండన్ ఏజంట్లు - బార్క్లేస్ బ్యాంకు లిమిటెడ్, చీఫ్ ఫారిన్ బ్రాంచి,
166 ఫెన్ చర్చి స్ట్రీటు, లండన్, ఇ. సి. 3.

ఫారిన్ ఎక్స్చేంజిసహా అన్నిరకములైన బ్యాంకింగు వ్యాపారములు చేయబడును.

| | |
|---|---|
| తాడేపల్లి శ్రీరాములు<br>మేనేజింగు డైరెక్టరు. | ఏలేశ్వరపు రామచంద్రమూర్తి,ఎం.ఏ.,సి.ఎ.ఐ.ఐ.బి.,<br>జనరల్ మేనేజరు. |

# తూర్పు గోదావరి జిల్లా

## అంబటిపూడి బాలనాగేశ్వరరావు

కాంగ్రెస్: రాజమండ్రి, నియోజకవర్గం జననం: 1904 విద్య, స్కూల్. యం పి. 1921, 31, 42 స్వాతంత్ర్యోద్యమాలలో పాల్గొన్న కారణంగా జైలు శిక్ష, 1949 రాజమండ్రిలో వైద్య వృత్తి ప్రారంభం, 1937 నుండి రాజమండ్రి పురపాలక



సంఘసభ్యుడు 1947-55, పురపాలకసంఘ అధ్యక్షుడు, ప్రస్తుత మంత్రివర్గంలో సభ్యుడు, ప్రత్యేకాభిమానం, గాంధీజీనిర్మాణకార్యక్రమము, అడ్రెస్సు: 8/62 ఆర్యాపురం, రాజమండ్రి, తూ॥ గో॥ జిల్లా

## కళా వెంకటావు

కాంగ్రెస్: కొత్తపేట: నియోజకవర్గం జననం: 7-7-1900, విద్య: ఓ. ఎ. వరకు 1929లో విద్యకుస్వస్తి, 1922 నుండి జాతీయోద్యమాలలో పాల్గొనగా అనేక



సార్లు కారాగారవాసశిక్ష, 1937లోను 46లోను మద్రాసు శాసనసభలో సభ్యుడు, 1947-49 వరకు మద్రాసు రాష్ట్రరివెన్యూ మంత్రి 1951లో అఖిలభారత కాంగ్రెస్ కార్యదర్శి, 5 నెలలు పార్లమెంటులో సభ్యుడు, 1951-52, 5 నెలలు పాటు మద్రాసురాష్ట్ర ఆరోగ్యమంత్రి, 1954 జనవరినుంచి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు, ప్రస్తుత మంత్రివర్గంలో సభ్యుడు, అడ్రెస్సు: అమలాపురం తూర్పు గోదావరిజిల్లా.

## కీ॥ శే॥ నీరుకొండ రామారావు

కాంగ్రెస్: బూరుగుపూడి (జనరల్) నియోజకవర్గం, వయస్సు: 41 విద్య: న్యాయశాస్త్ర పట్టభద్రుడు, 16వ ఏట 4వ ఫారం చదువుతుండగా ఉప్పుసత్యాగ్రహ కారణంగా 18 నెలలు జైలుశిక్ష, 1369 లో రాజమండ్రి తాలూకా కాంగ్రెస్



సంఘాధ్యక్షుడు, 1947-48లో తూర్పు గోదావరిజిల్లా కాంగ్రెస్ సంఘ కార్యదర్శి, 1951లో రంగాగారితో పాటు కాంగ్రెస్ నుండి విప్రమణం 1952ఎన్నికలలో కె. యల్. పి అభ్యర్థిగా మద్రాసు శాసనసభకు ఎన్నిక ఆంధ్ర మంత్రివర్గంలో వ్యవసాయ మంత్రిగా నియమింపబడి, మే నెల 4వ తేదీ మద్రాసు జనరల్ ఆస్పత్రిలో చనిపోయినారు.

## పర్వత గుర్రాజు

కాంగ్రెస్: ప్రత్తిపాడు, నియోజకవర్గం, జననం: 1917 విద్య: యస్. యస్. యల్. సి. వరకు 1915 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 1947 – 53 జిల్లా సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంకి డైరెక్టరు,1944-55 గ్రామ సహకారసంఘ అధ్యక్షుడు, 1953 లో పంచాయితీ బోర్డుఅధ్యక్షుడు, 1951 –55 ప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడు, అడ్రెస్సు: శంఖవరం, వయా, గొల్లప్రోలు తూర్పుగోదావరిజిల్లా.



## యస్. బి. పి. పట్టాభి రామారావు

కాంగ్రెస్: పామర్రు: నియోజకవర్గం జననం, 30-12-1911 విద్య: బి. ఎ బి. యల్, 1944 సెనెట్ మరియు సిండికేట్ సభ్యుడు, 1942–52 రాష్ట్రీయ సహకార బ్యాంక్ కార్యచరణ సంఘ సభ్యుడు, 1946 రిజర్వుబ్యాంక్ డైరక్టరు 1952 సంయుక్త మద్రాసు శాసనసభకు ఎన్నిక రాజాజీ మంత్రివర్గంలోను ప్రథమ ఆంధ్ర రాష్ట్రమంత్రివర్గంలోను సభ్యుడు: అడ్రెస్సు, కపిలేశ్వరపురం, తూర్పుగోదావరిజిల్లా



## గంజి నాగేశ్వరరావు

కమ్యూనిస్టు: రాజోలు (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు: 32 సం॥ విద్య: యస్. యస్. యల్. సి 1940 నుండి కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం 1942 లో 7 మాసాలు 48 జూలై నుండి 51 ఏప్రియల్ వరకు జైలు శిక్ష, రాజమండ్రి సెంట్రల్ జైలులో 1948 సం॥లో 8 రోజులు, కడలూరు జైలులో 1949 సం॥ లో డిటెన్యూలపై కాల్పులకు నిరసనగా 25 రోజులు, జైలు అధికారుల నిరంకుశ చర్యలకు వ్యతిరేకంగా 10 రో॥ మొత్తం 43 రోజులు, నిరసన వ్రతాలు, తూర్పుగోదావరిజిల్లా వ్యవసాయ కూలీ సంఘ అధ్యక్షుడు, 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు యిదే నియోజకవర్గంనుండి, కమ్యూనిస్టు అభ్యర్థిగా ఎన్నిక, అడ్రెస్సు : కడలి, రాజోలు తాలూకా, తూర్పుగోదావరిజిల్లా.



## దూర్వాసుల వెంకటసుబ్బారావు

కమ్యూనిస్టు, పెద్దాపురం, నియోజకవర్గం, జననం 10-5-1911, విద్య : బి.ఎ. యల్. యల్. బి. న్యాయవాదిగా పని చేస్తూ అమలాపురంలో అసిస్టెంట్ పబ్లిక్ ప్రాసిక్యూటర్ గా నియామకం, 1942 సం॥ లో క్విట్ ఇండియా ఉద్యమములో పాల్గొనే నిమిత్తం ఉద్యోగమునకు రాజీనామా ఇవ్వగా, ప్రాసిక్యూటుకాబడి ఆరునెలలు జైలుశిక్ష విధు

దల అనంతరం పట్టారద్దుకు కేసుపెట్టబడి కొట్టివేత. 1949 సం॥ నుండి కమ్యూనిస్టు పార్టీ సానుభూతి పరుడు, ప్రత్యేక అభిమానం, రాజకీయం, సారస్వతం, అడ్రసు, అడ్వకేటు, పెద్దాపురం, తూ॥గోదావరిజిల్లా.



## పుప్పాల సత్యనారాయణ

కమ్యూనిస్టు : సామర్లకోట, నియోజకవర్గం, జననం, 10-4-1909 విద్య, 8వ తరగతి 1921 లో కాంగ్రెస్‌లో చేరి ఇంగ్లీషు ప్రభుత్వ పాఠశాలల బహిష్కరణ, 1930 ఉప్పు సత్యాగ్రహం లో 6 మాసాలు జైలుశిక్ష. 1936 కాంగ్రెస్ సోషలిస్టుపార్టీలో ప్రవేశం, ఉప్పాడలో జరిగిన ప్రథమ ఆంధ్రరాష్ట్ర చేనేత మహాసభ కన్వీనరు. ఇప్పటివరకు చేనేత ఉద్యమ కార్యకర్త. 1943 నుండి కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు, 1954 లో అఖిలభారత చేనేత ఆర్గనైజింగ్ కమిటీ కన్వీనరుగా ఎన్నిక, అడ్రెస్సు, ఉప్పాడ, పిఠాపురం డివిజన్.



## బత్తిన సుబ్బారావు

స్వతంత్ర: బూరుగుపూడి (రిజర్వుడు) నియోజకవర్గం, ఐక్యకాంగ్రెస్ బలపరచిన స్వతంత్ర అభ్యర్థి, అడ్రెస్సు: కోలమూరు, రాజమండ్రి తాలూకా

## నీరుకొండ వెంకటరత్నమ్మ

కాంగ్రెస్ : బూరుగుపూడి (జనరల్) నియోజకవర్గం, ఈఎన్నికలలో ఇదేనియోజకవర్గం నుండి ఎన్నికై ఆంధ్రమంత్రి మండలిలో సభ్యుడుగా ఉండిన నీరుకొండ రామారావుగారు అకాలమరణానికి గురైన కారణంగా ఏర్పడిన ఉపఎన్నికలలో కాంగ్రెస్అభ్యర్థిగా పోటీలేకుండాఎన్నిక.

## శ్యామల సీతారామయ్య

కమ్యూనిస్టు : భద్రాచలం (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు: 26 సం॥ విద్య, 8 వ తరగతి వరకు భద్రాచలం తాలూకా రైతు సంఘాధ్యక్షుడు, 1952 నుండి కమ్యూనిస్టు పార్టీ కార్యకర్త సెక్యూరిటీ చట్టంకింద 6 మాసములు నిర్బంధము, ప్రత్యేక అభిమానం, ఏజన్సీ ప్రజానీకము యొక్క జీవన అభివృద్ధి, అడ్రెస్సు, మామిళ్లగూడెం, భద్రాచలంతాలూకా.



## మహమ్మద్ తహశీల్

కమ్యూనిస్టు : భద్రాచలం (జనరల్) నియోజకవర్గం, వయస్సు, 28 సం॥ విద్య, 8 వ తరగతి వరకు 1952 నుండి కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు భద్రాచలం తాలూకా రైతు సంఘ కార్యదర్శి ప్రజా ఉద్యమ నాయకత్వ కారణంగా ఆరు మాసములు జైలు



శిక్ష. ఏజన్సీ కమ్యూనిస్టు కమిటీసభ్యుడు, ప్రత్యేక అభిమానం, ఏజన్సీ ప్రాంత పురోభివృద్ధి, అడ్రెస్సు, కూనవరం, భద్రాచలంతాలూకా.

## రేమళ్ళ తిరుపతిరావు

కాంగ్రెసు : పల్లిపాలెం నియోజకవర్గం, జననం : 23-9-1917, విద్య : తెలుగు. 12 సం॥లు కాంగ్రెసు ప్రాథమిక సభ్యుడు, 6 సం॥లు జిల్లా కాంగ్రెస్ సభ్యుడు, 19 సం॥లుగా దుగ్గుదుర్రు గ్రామపంచాయితీబోర్డు అధ్యక్షుడు. ప్రత్యేక అభిమానం : ప్రజాసేవ, వ్యవసాయము. అడ్రస్సు: దుగ్గుదుర్రు, కాకినాడతాలూకా.



## రెడ్డి కామయ్య

కాంగ్రెసు : పల్లిపాలెం నియోజకవర్గం, జననం : 1-7-1909, విద్య : హైయ్యర్ గ్రేడు టీచర్ ట్రైనింగ్. 1932 నుండి కాంగ్రెసువాది, 1939-53 హరిజన సేవా సంఘసభ్యుడు. 1947 హరిజన వెల్ఫేర్ సభ్యుడు. 1954 జిల్లా కాంగ్రెసు సభ్యుడు. ప్రత్యేక అభిమానం : గాంధీజీ నిర్మాణ కార్యక్రమము. అడ్రెస్సు : తాళ్ళరేవు, కాకినాడతాలూకా, తూర్పుగోదావరిజిల్లా.



## అల్లూరు వెంకట్రామరాజు

కమ్యూనిస్టు : రాజోలు నియోజకవర్గం, జననం, 1918 విద్య: 4 వ ఫారము 1934-38 వరకు కాంగ్రెస్ సభ్యుడు 1939లో కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశం 1943 నుంచి సంఘ నిర్మాణంలో ప్రముఖ కార్యకర్త 1947 ప్రకాశం ఆర్డినెన్సులో కారాగారవాసం, 1949 లో అజ్ఞాతవాసం తరువాత రెండు సంవత్సరాలు డిటెన్యూ 1952లో మద్రాసు శాసనసభ సభ్యుడు. ప్రత్యేక అభిమానం: రైతు ఉద్యమము, సాంఘిక సంస్కరణలు. అడ్రెస్సు అంతర్వేదిపాలెం రాజోలు తాలూకా తూర్పుగోదావరి జిల్లా.

## కాకర్లపూడి రామచంద్రరాజా బహద్దూర్

ప్రజాపార్టీ : రామచంద్రపురం నియోజకవర్గం, జననం : 7-5-22, విద్య : బి.యస్ సి. రామచంద్రపురం పంచాయితీబోర్డు అధ్యక్షుడు, జిల్లా ప్రజాపార్టీ అడ్హాక్ కమిటీ సభ్యుడు. అడ్రెస్సు : రామచంద్రపురం



## దురిశేటి గోపాలరావు

స్వతంత్ర : జగ్గంపేట, నియోజకవర్గం జననం, 24-1-1907 విద్య : లయోలా కాలేజీవిద్యార్థి, 1930-42జగ్గయ్యపేటయస్టేటు దివాను, 1929 మునిసిపల్ కౌన్సిలరు 1936 జిల్లాబోర్డు మెంబరు, కాకినాడ కాస్మాపాలిటిన్ క్లబ్బుసభ్యుడు, అడ్రెస్సు : కాకినాడ.

## మల్లిపూడి పళ్ళంరాజు

కాంగ్రెస్: కాకినాడ నియోజకవర్గం, జననం : 25-4-1899, విద్య : యల్.ఏజి. కోయంబత్తూరు. 1928లో రాజకీయాలలో ప్రవేశించి అన్ని జాతీయోద్యమాలలోను పాల్గొని జైలుశిక్ష. ఇదివరలో జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు, జిల్లా బోర్డు అధ్యక్షుడు, రాష్ట్ర కాంగ్రెసు ఉపాధ్యక్షుడు, మద్రాసు శాసనసభలో కాంగ్రెస్ పార్టీ ఉపనాయకుడు. అడ్రెస్సు : కాకినాడ.



## రాజావత్సవాయ వెంకట కృష్ణమరాజ బహద్దూర్

కాంగ్రెస్ : తుని నియోజకవర్గం, వయస్సు : 72 సం॥లు. 20 సం॥లు తాలూకా బోర్డు అధ్యక్షులుగా, 1932-37 పీపుల్స్ పార్టీ సభ్యుడు. ప్రస్తుతం కాంగ్రెస్ పార్టీ సభ్యుడు. అడ్రసు: తుని.



## నడిపల్లి రామభద్రరాజు

కాంగ్రెస్ : చెయ్యేరు నియోజకవర్గం, జననం : 9-11-1916, విద్య : స్కూలు ఫైనలు. 1941 వ్యక్తి సత్యాగ్రహంలోను, 42, 44 జాతీయోద్యమాలలోను జైలుశిక్ష, 1946 మద్రాసు శాసనసభకు పోటీలేకుండా ఎన్నిక, 1951 డిశంబరులో కాంగ్రెస్‌నుండి రాజీనామా, అప్పటివరకు జిల్లా ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీలలో సభ్యుడు, 1952 కిసాన్ మజ్దూర్ ప్రజా పార్టీ అభ్యర్థిగా అమలాపురం నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నిక, కొంతకాలం అమలాపురం యూనియన్ అధ్యక్షుడు, కోనసీమ కో-ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి ఉపాధ్యక్షుడు, కోనసీమ భానోజీ రామర్సు కాలేజీ స్థాపననుండి ఇప్పటికి దాని అధ్యక్షుడు, ప్రజాపార్టీ ఉపాధ్యక్షుడు, కుమారప్ప ప్రాథమిక విద్యావిచారణ సంఘము సభ్యుడు. ప్రత్యేక అభిమానం : వ్యవసాయము అడ్రెస్సు: కోడూరుపాడు, అమలాపురంతాలూకా.



## వాడరేవు గోపాలకృష్ణ

ప్రజాపార్టీ : పిఠాపురం, నియోజకవర్గం జననం, 24-8-1913 విద్య: బి. యస్. సి. అనేక సహకార బ్యాంకుల ప్రెసిడెంటు, డైరక్టరు పిఠాపురం పంచాయితీ బోర్డు అధ్యక్షుడు, అడ్రెస్సు : పిఠాపురం.

## గోలకోటి నరసింహమూర్తి

స్వతంత్ర : అమలాపురం, (జనరల్) నియోజకవర్గం, అడ్రెస్సు: గున్నేపల్లి అమలాపురం తాలూకా

## బొజ్జా అప్పలస్వామి

షెడ్యూల్డు జాతుల ఫెడరేషన్: అమలాపురం (రిజర్వుడు) నియోజకవర్గం, జననం 1913 విద్య. స్కూలుఫైనలు 1932లో విద్యచాలించి ఉపాధ్యాయ వృత్తిపై మా॥ 20 సం॥రములు గడిపి ఆ కాలంలో జాతి పురోభివృద్ధి కార్యక్రమములో పాల్గొని, వ్యవసాయకూలీ సహకార సంస్థల నెలకొల్పి తాలూకా, జిల్లా, సంఘాల కధ్యక్షత వహిస్తూ 1952 జనరల్ ఎన్నికలలో అమలాపురం (రిజర్వుడు) నియోజకవర్గం నుండి శాసనసభకు ఎన్నిక. ప్రత్యేక అభిమానం: నిమ్నజాతుల పురోభివృద్ధి కొరకు, మానవ జాతిసమైక్యత కొరకు పాటుపడు సంస్థలలో పాల్గొనుట, అడ్రెస్సు కందికుప్ప అమలాపురం, తాలూకా.

## తేతల లక్ష్మీనారాయణరెడ్డి

ప్రజాపార్టీ : అనపర్తి, నియోజకవర్గం జననం, 20-10-1924 విద్య, యం. ఎ. యల్. యల్.బి.అడ్వకేటు ప్రత్యేక అభిమానం గ్రంథ పఠనం అడ్రెస్సు, దానవాయిపేట, రాజమండ్రి.



# “గులాబిపువ్వు” మార్కు

## అగ్గిపెట్టెలనే వాడండి



ఎందువలననగా




★ మంచిగా వెలుగును

★ పారులేని నాణ్యమైన పుల్లలు

★ నెమ్మదిగా కాలును

★ చేతికి అమరిన పెట్టె

★ అందరకు అందుబాటులోనున్న

★ శుభప్రదమైన మార్కు [ధర

★ కొట్టుకు అలంకారము

★ విలువకు తగిన నాణ్యము

★ మొదటి బహుమానము పొందినది

★ చేతిపరిశ్రమను ప్రోత్సహించుట

1954 సంవత్సరములో
హైదరాబాదులో జరిగిన
ఆల్ ఇండియా ఇండస్ట్రియల్
ఎగ్జిబిషనులో
మొదటి బహుమానము
పొందినది.

అన్ని కాలములలో గ్యారంటీగా పనిచేయును
“ గిఫ్టుకూపనులు ” పొంది లాభమునుకూడ పొందవచ్చును

# పశ్చిమ గోదావరి జిల్లా

## సీర్ల బ్రహ్మయ్య

కాంగ్రెస్ : ఏలూరు నియోజకవర్గం, జననం : 10-6-1913, విద్య : ఇంగ్లీషు, హిందీ, బెంగాలీ, ఉర్దు, తమిళం, సంస్కృతంలో ప్రవేశం, 1931, 32 జాతీయోద్యమాలలో పాల్గొని 41, 42 సత్యాగ్రహోద్యమాలలో 32 నెలలు జైలుశిక్ష, అనేక సంవత్సరాలు పట్టణ జిల్లా కాంగ్రెస్ కమిటి సెక్రటరీ, ఉపాధ్యక్షుడు, 45, 46 ఆంధ్ర కాంగ్రెస్ సభ్యుడు, ఆనడి కాంగ్రెస్ డెలిగేటు, 1932 లో హిందీ బాలమిత్ర మండలి స్థాపించి హిందీ విద్యావ్యాప్తికి, 1938 లో యువజన అభ్యుదయమండలి స్థాపించి యువకులలో రాజకీయ చైతన్యానికి కృషి, హిందీ ప్రేమీమండలి, ఏలూరు స్థాపకుడు, అధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్ర హిందీ ప్రచారసభ, కార్యాచరణ సంఘ సభ్యుడు, ఏలూరు కోఆపరేటివ్ అర్బన్ బ్యాంకి డైరక్టరు : ప్రస్తుతం ఏలూరు మునిసిపల్ కాంగ్రెస్ పార్టీ నాయకుడు, ప్రత్యేకఅభిమానం : సాహిత్యం, లలిత కళలు, అడ్రస్సు : ఏలూరు.



## మూల్పూరి రంగయ్య

కాంగ్రెస్ : దెందులూరు నియోజకవర్గం, జననం : 1897, విద్య : మద్రాసు వైద్యకళాశాల పట్టభద్రుడు, 1927 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 1930, 32, 40, 42 జాతీయోద్యమాలలో జైలుశిక్ష, 1938-42 వరకు పశ్చిమగోదావరి జిల్లాబోర్డు అధ్యక్షుడు, 2 సార్లు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షునిగా ఎన్నిక, 27 సం॥లుగా ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ సంఘంలోను 15 సం॥లుగా అఖిల భారత కాంగ్రెస్ సంఘసభ్యుడు 1939లో ఆంధ్రరాష్ట్ర రాజకీయమహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షుడు, ప్రత్యేకఅభిమానం: సంఘ సంస్కరణ, సంఘసేవ, అడ్రస్సు : బెనర్జీపేట, ఏలూరు, పశ్చిమగోదావరిజిల్లా.



## చోడగం అమ్మన్నరాజా

కాంగ్రెస్ : అత్తిలి నియోజకవర్గం, జననం : 6-2-1909, విద్య : బి.ఎ. 1937, 1946 లోను మద్రాసు శాసనసభలో సభ్యురాలు, 1946-52 శాసనసభ డిప్యూటీ స్పీకరు, ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కార్యనిర్వాహకవర్గం గౌరవసభ్యురాలు, అడ్రస్సు : రేలంగి, తణుకు తాలూకా.



## శ్రీమత్ కిడాంబి వెంకట కృష్ణావతారం

ప్రజాపార్టీ : తాడేపల్లిగూడెం (జనరల్) నియోజకవర్గం, జననం : 1912, విద్య : బి. ఎ. బి. యల్, విద్యార్థిదశ నుండి జాతీయ భావాలుకల్గి 1949 లో కాంగ్రెస్ కార్యాచరణ సంఘ సభ్యుడుగా ప్రవేశించి 51 లో ప్రకాశంగారితో కాంగ్రెస్‌నుండి విడిపోయి, కిసాన్‌మజ్దూర్ ప్రజాసోషలిష్టు పార్టీలలో సభ్యుడుగా ఉండి ఆంధ్రరాష్ట్ర విభజన అనంతరం విశ్వనాథంగారి నాయకత్వాన స్థాపించిన ప్రజాపార్టీ స్థాపకులలో ఒకడు, ఏలూరు మునిసిపల్ కౌన్సిల్ సభ్యుడు, ప్రత్యేక అభిమానం : హరిజనుల, వెనుకబడిన జాతుల, ఆర్థిక, సాంఘిక అభివృద్ధికికృషి, అడ్రస్సు : 17-ఎ అశోకనగర్ ఏలూరు.



## గాదిరాజు జగన్నాథరాజు

కాంగ్రెస్ : ఉండి నియోజకవర్గం, జననం:26-8-1906, విద్య : బి. యస్. సి. యల్.యల్.బి., అడ్వకేటు 1925 నుండి రాజకీయాలలో పరిచయం, 1942, 45 జాతీయోద్యమాలలో జైలునిర్బంధం, ఆంధ్రప్రదేశ్ ప్రొవిన్షల్‌కమిటీ సభ్యుడు, భీమవరం బార్‌అసోసియేషన్ అధ్యక్షుడు, హిందీ ప్రేమీమండలి అధ్యక్షుడు, 1953 లో గోదావరి వరద సహాయసంఘ అధ్యక్షులు, అడ్రస్సు : భీమవరం.



## చింతలపాటి సీతారామచంద్ర వరప్రసాదమూర్తిరాజు

కాంగ్రెస్ : పెంటపాడు నియోజకవర్గం, జననం : 17-12-1919, విద్య : యస్.యస్. యల్. సి. ప్రదేశ్ కాంగ్రెస్ సంఘం, రాష్ట్ర హరిజన సేవా సంఘం, పశ్చిమ గోదావరిజిల్లాబోర్డు సభ్యుడు, ఇరిగేషన్ అడ్వయిజరీబోర్డు అధ్యక్షుడు, భీమవరం ప్రకృతిఆశ్రమము కార్యదర్శి, నిడదవోలులోని "బీగం అజాద్ మెమోరియల్ గరల్సు ఇన్‌స్టిట్యూట్‌కు ప్రధానపోషకుడు, భీమవరంలో ఉన్నతపాఠశాల స్థాపకుడు, కళాశాల కార్యనిర్వాహక సంఘసభ్యుడు, "ఆంధ్రా లెజిస్లేచర్ క్లబ్" స్థాపకుడు, దాని అధ్యక్షుడు, ప్రత్యేకఅభిమానం : లలితకళలు, స్త్రీవిద్య, వెనుకబడినజాతుల ఔన్నత్యత, ప్రకృతి చికిత్స, అడ్రస్సు : పత్తేపురం, తాడేపల్లిగూడెంతాలూకా.



## ముళ్లపూడి హరిశ్చంద్రప్రసాద్

కాంగ్రెస్ : తణుకు, నియోజకవర్గం, గడచిన సమిష్టి మద్రాసు శాసన సభలో కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ సభ్యుడు అడ్రస్సు, తణుకు.

## జవ్వాది లక్ష్మయ్య

కాంగ్రెస్ : పెనుగొండ, నియోజకవర్గం, జననం : 16-11-1901 విద్య : స్కూలు ఫైనలు



ఆంధ్ర సాహిత్య పరిషత్తు స్థాపకుడు, ఇదివరలో 'విశ్వామిత్ర' సంపాదకుడు 1925 నుండి పెనుగొండ పంచాయితీ బోర్డు అధ్యక్షుడు, 1927 నుండి తాలూకాబోర్డు సభ్యుడు, 1927-47 జిల్లాబోర్డు సభ్యుడు, అధ్యక్షుడు జిల్లా మాధ్యమిక విద్యాసంఘం, పెనుగొండ భూమితనఖా బ్యాంకు, ఏలూరు కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి, పశ్చిమ గోదావరి జిల్లా స్థానిక గ్రంథాలయము, ఏలూరు మార్కెటింగ్ ఫెడరేషన్ ఉపాధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్ర కోఆపరేటివ్ బ్యాంకి డైరక్టరు, జిల్లావ్యవసాయ కళాశాల, మారుటేరు వ్యవసాయ పరిశోధనాగారముల సలహాసంఘసభ్యుడు బీదవిద్యార్థుల విద్యాభివృద్ధికి కృషి, అనేక గ్రంథములకు కృతిభర్త.ప్రత్యేకఅభిమానం: సాహిత్యం, నవీన పద్ధతులలో వ్యవసాయము, హరిజనాభివృద్ధి, అడ్రస్సు : పెనుగొండ

## గ్రంధి వెంకటరెడ్డి

కాంగ్రెస్ : నరసాపురం, నియోజకవర్గం, అడ్రస్సు, నరసాపురం.

## అల్లూరు బాపినీడు

కాంగ్రెస్ కొవ్వూరు (జనరల్) నియోజకవర్గం, విద్య బి. ఎ. బి. యల్. అడ్వకేటు, 1939 నుండి



కాంగ్రెస్ సభ్యుడు రెండు సంవత్సరాలుగా జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు పశ్చిమ గోదావరి జిల్లా కోఆపరేటివ్ బ్యాంకి డైరక్టరు, అడ్రస్సు : కొవ్వూరు.

## తానేటి వీరరాఘవులు

కాంగ్రెస్ : కొవ్వూరు, (రిజర్వుడు) నియోజకవర్గం, జననం: 6-7-1917 విద్య బి. ఎ. బి. యల్.



ఆంధ్ర యూనివర్సిటీ సెనేటు సభ్యుడు, విశాఖపట్నం కోఆపరేటివ్ బ్యాంకి డైరక్టరు అఖిలభారత కాంగ్రెస్ వ్యవసాయ సంస్కరణ (కుమారప్ప కమిటీ) సభ్యుడు, అఖిల భారత కాంగ్రెస్ సలహాసంఘ సభ్యుడు, ఆంధ్రరాష్ట్ర హరిజన సంక్షేమ సంఘ సభ్యుడు, ప్రత్యేక అభిమానం, సాంఘిక సేవ
అడ్రస్సు, కొవ్వూరు.

## పుసులూరి కోదండరామయ్య

కాంగ్రెస్: పోలవరం, నియోజకవర్గం, వయస్సు, 69 సం॥ విద్య, సం. ఎ. 1906 నుండి కాంగ్రెస్ సభ్యుడు, కొంత కాలం ప్రదేశ్ కాంగ్రెస్ కార్యనిర్వాహక వర్గంలోను అఖిల భారత కాంగ్రెస్ సంఘంలోను సభ్యుడు, అఖిల భారత ఏజన్సీ ప్రజలసంఘ స్థాపకుడు దాని అధ్యక్షుడు, పోలవరంలో స్వరాజ్య ఆశ్రమంలో దాని ప్రధాన కార్యకర్త కొంతకాలం పార్లమెంటు మెంబరు ఆంధ్రదేశంలో జైలుశిక్ష ఎక్కువ కాలం 10 సం. 5. రో. అనుభవించిన కాంగ్రెస్ వాది, ప్రత్యేక అభిమానం: ఏజన్సీ ప్రాంత (గిరిజనుల) ఉద్ధరణ, అడ్రస్సు స్వరాజ్యఆశ్రమం, పోలవరం.



## దాసరి పెరుమాళ్లు

కాంగ్రెస్ : పాలకొల్లు, (రిజర్వుడు) నియోజకవర్గం, జననం, 12-4-1917 విద్య, మెట్రిక్యులేషన్, జిల్లా హరిజన సేవక సంఘ సభ్యుడు, జిల్లా కాంగ్రెస్, కార్యవర్గసభ్యుడు తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు, అడ్రస్సు: పూలపల్లి వయా, పాలకొల్లు.



## అద్దేపల్లి సత్యనారాయణమూర్తి

కాంగ్రెస్ : పాలకొల్లు (జనరల్) నియోజకవర్గం, జననం, 6-1-1900, 1920 నుంచి కాంగ్రెస్ కార్యకర్త, 1931-42 పాలకొల్లు మునిసిపల్ ఛైర్మన్ అడ్రస్సు : పాలకొల్లు వర్సాపురం, తాలూకా



## నామ వెంకటాద్రినయ్య

కాంగ్రెస్: భీమవరం, నియోజకవర్గం, వయస్సు : 41 సం॥ విద్య, యస్ యస్. యల్. సి. 1943 నుండి కాంగ్రెస్ సభ్యుడు, కొంత కాలం జిల్లాకాంగ్రెస్ సభ్యుడు, ప్రస్తుతం భీమవరం మునిసిపల్ ఛైర్మన్, అడ్రస్సు : భీమవరం.

## నంబూరి శ్రీనివాసరావు

కాంగ్రెస్ : తాడేపల్లిగూడెం, (రిజర్వుడు) నియోజకవర్గం, అడ్రస్సు: కాంగ్రెస్ ఆఫీసు, తాడేపల్లిగూడెం.



---



---

# కృష్ణా జిల్లా

## అయ్యదేవర కాళేశ్వరరావు



కాంగ్రెస్, విజయవాడ దక్షిణ నియోజకవర్గం, జననం : 21-1-1881, విద్య: బి.ఎ బి.యల్, 1906-1921 న్యాయవాదవృత్తి, 1919లో గాంధీజీ 'రౌలత్' సత్యాగ్రహయాత్ర సందర్భములో విజయవాడ వచ్చినప్పుడు వారి సహచరుడుగా చేరి వందేమాతరం "హోమ్‌రూల్" మొదలగు గాంధీజీ ఉద్యమాలలో తీవ్రకృషి, 1921, 30, 32, 33, 40, 42, జాతీయోద్యమాలలో జైలుశిక్ష, 1917నుండి, ఎ. ఐ. సి. సి. సభ్యుడు 10సం, 6 నెలలు ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శి. 4సం, ఉపాధ్యక్షత. రెండుసార్లుమునిసిపల్ ఛైర్మన్‌గా ఎన్నిక జైలుకి వెళ్ళిన సందర్భములో ఛైర్మన్ పదవికి రాజీనామా, విడుదల అనంతరం, "విజయవాడ స్వాతంత్ర్యపౌరసత్వం" ప్రదానం, 1926-29 మద్రాసు శాసనసభకు ఎన్నికై స్థానికసంస్థలకు నామినేషన్ పద్ధతి రద్దుకు బిల్లు ప్రతిపాదన, 1937-39 మద్రాసు శాసనసభకు ఎన్నిక, ఆ కాలంలో ప్రధాన పార్లమెంటరీ కార్యదర్శి, కాంగ్రెస్ పార్టీ చీఫ్‌విప్, 1946-51 తిరిగి మద్రాసు శాసన సభ్యుడుగా ఎన్నిక, ఆంధ్రవిశ్వవిద్యాలయము సెనెట్, సిండికేట్, సభ్యుడు, విజ్ఞానచంద్రికామండలి స్థాపన, బహుగ్రంథకర్త, ఆంధ్రదేశములో గ్రామీణ గ్రంథాలయ ఉద్యమములోను, హిందీప్రచార ఉద్యమములోను కృషి, విశాలాంధ్ర మహాసభ స్థాపన దానిఅధ్యక్షత, ప్రత్యేక అభిమానం, గాంధీగారి సిద్ధాంతప్రకారము శ్రేయోరాజ్య స్థాపన, అడ్రస్సు: గవర్నరుపేట, విజయవాడ-2, ఫోను, నెం. 131

## మరుపిళ్ళ చిట్టి



కాంగ్రెస్, విజయవాడ (2) ఉత్తర నియోజకవర్గము, జననం: 27-11-1898, విద్య: తెలుగు, 1919 రాజకీయ రంగప్రవేశం, 1920 విదేశ వస్త్ర దహనంలో ప్రముఖపాత్ర, 1921, 24, 29, 30 జాతీయోద్యమాలలోను, 1942 ఆగస్టు ఉద్యమములోను జైలుశిక్ష, 1939 ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సభ్యుడుగా ఎన్నిక, 1936 సివిక్ బోర్డుమెంబరు, 1937 ప్రదేశ్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటీమెంబరు, 1943 పెరోల్ మీదవిడుదలై తిరిగి కారాగార ప్రవేశం, 4-8-58నుండి పట్టణకాంగ్రెస్ అధ్యక్షత, అడ్రస్సు: కొత్తపేట, విజయవాడ, 1.

## కాకాని వెంకటరత్నం

కాంగ్రెస్: ఉయ్యూరు, నియోజకవర్గం, వయస్సు: 54సం. 1930సం. లోను 1932 లోను శాసనోల్లంఘనములో జైలుశిక్ష, 1938 పశ్చిమకృష్ణాజిల్లా కాంగ్రెస్‌కమిటి జనరల్ సెక్రెటరీ, 1942 ఉద్యమములో డిటెన్యూ, 1945 కృష్ణాజిల్లా తుఫాను బాధితుల రిలీఫ్ కమిటి



కార్యదర్శి, 1947-49 పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంటు, 24-10-1949 నుండి 30-6-1953 వరకు కృష్ణాజిల్లాబోర్డు ప్రెసిడెంటు, 1951 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెసుకమిటి కార్యనిర్వాహకవర్గ సభ్యుడు, 1952 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి జనరల్ సెక్రెటరీ, 30-6-1953 నుంచి నేటివరకు పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంటు, ప్రత్యేక అభిమానం: అవడి కాంగ్రెస్‌లో తీర్మానించిన సోషలిస్టు సమాజ సిద్ధాంతఆచరణ, అడ్రస్సు: ప్రెసిడెంటు, పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యాలయము, విజయవాడ, 2.

## పుచ్చలపల్లి సుందరయ్య

కమ్యూనిస్టు, గన్నవరం, నియోజకవర్గం, జననం. 1913, పదునాలుగో ఏటనే రాజకీయోద్యమాలలో ప్రవేశించి తోటివిద్యార్థులతో "సోదరసమితీ" స్థాపన, సైమన్ కమిషన్ వ్యతిరేక ప్రదర్శన, 1930లో పశ్చిమగోదావరిజిల్లా సత్యాగ్రహశిబిరంలోచేరి, అరస్టయి బోర్‌స్టల్ స్కూలులో రెండేండ్లుశిక్ష, 1932 లో కమ్యూనిస్టు పార్టీ ప్రవేశం, 1934 ఆంధ్రలో కమ్యూనిస్టు పార్టీస్థాపన, రాష్ట్ర సోషలిస్టు పార్టీ కార్యదర్శి, రెండవ ప్రపంచ



యుద్ధము మొదలు 1942లో కమ్యూనిస్టు పార్టీపైనిషేధం తొలగు వరకు అజ్ఞాతవాసం, 1946లో విశాలాంధ్ర ఉద్యమానికిమూలం అయిన "విశాలాంధ్రలో ప్రజారాజ్యం" అనేపుస్తక రచన, 1947 నుండి మరల రహస్య జీవితం, అజ్ఞాతవాసంలో ఉండగానే రాజ్యసభకు ఎన్నిక, దక్షిణ భారతకమ్యూనిస్టుపార్టీ స్థాపకుడు, అఖిల భారత కమ్యూనిస్టుపార్టీకి మొదటి నుండి ఇప్పటివరకు కేంద్రకమిటీ సభ్యుడు, భారతకమ్యూనిస్టుపార్టీ పొలిట్ బ్యూరో సభ్యుడు, ఇప్పటి ఆంధ్రశాసనసభ కమ్యూనిస్టుపార్టీ నాయకుడు గాఎన్నిక, అడ్రస్సు విశాలాంధ్ర, విజయవాడ-2.

## పిల్లలమర్రి వెంకటేశ్వర్లు

కమ్యూనిస్టు, జగ్గయ్యపేట నియోజకవర్గం, వయస్సు: 40సం. కాంగ్రెస్‌లోచేరి సైమన్ కమిషన్ బహిష్కరణ, కమ్యూనిస్టుపార్టీ సభ్యత్వం. ఆంధ్ర కార్మికోద్యమనిర్మాతలలోఒకడు, రాష్ట్ర ట్రేడ్ యూనియన్ కాంగ్రెస్‌కు మొద



చేనేతవస్త్రములుకొని రెండుకోట్ల చేనేత పారిశ్రామికులకు జీవనోపాధికల్పించండి!

# గుంటూరు చేనేత పారిశ్రామికుల సహకార ఉత్పత్తి విక్రయ సంఘం, లిమిటెడ్, గుంటూరు

మావద్ద చేనేతవస్త్రములు గ్యారంటి రంగులలో జరీపేటు చీరెలు, రెవికబట్టలు మరియు సాదాచీరెలు, ధోవతులు, కండువాలు, జాకెటుబట్టలు, షర్టింగ్ వగైరా సరికొత్తరకములు పనివారలచే తయారుచేయించి చౌకధరలకు విక్రయించబడును.

ఆకురాతి అంజనేయులు, ప్రెశిడెంటు
చేనేత సహకారసంఘం, గుంటూరు.

---

# ఉ మా స్టో ర్సు

మొగలికుదురు (పోష్టు)
రాజోలు తాలూకా, తూ. గో. జిల్లా

చేమగ్గములమీాద తయారుకాబడిన అన్నిరకములనవార్లు, కుర్చీ, మంచం పట్టాలు, ఉయ్యాళ్లు, ఆఫీసుటేపులు వగైరాలకు ప్రసిద్ధిచెందినది.

సోల్ ఏజంటు :

**జి. సుబ్బారావు**
తులశీరామ్‌చౌక్, తెనాలి.

---

# నవీనపద్ధతులలో నిపుణులైన పనివారలచే తయారుచేయబడిన వెండి, బంగారు సామానులు దొరకును

| | |
|---|---|
| **CHILUKURU PAPAIAHCHETTY** | చి ల్కూ రు పా ప య్య శె ట్టి, |
| Shroff Merchant | బంగారు, వెండి నగలవ్యాపారం |
| Shop No. 14 | షాపు నెం. 14 |
| SriVenkata Chalapati Shroff Bazar | శ్రీ వెంకటాచలపతి షరాపు బజారు |
| KARNOOL | క ర్నూ లు |

నా ణ్య ము న కు పే రు పొం ది న వా రు

టిఅధ్యక్షుడు, యుద్ధవ్యతిరేక ప్రచారం చేసినందుకు 2ఏళ్లు శిక్ష, 1946 జనరల్ ఎన్నికలలో, పశ్చిమ గోదావరి కృష్ణా గుంటూరు జిల్లాలకార్మిక నియోజకవర్గం నుండి ఎన్నిక, 1948 డిటెయిన్ చేయబడి ఎన్నికల ముందు విడుదల, 1952 జగ్గయ్యపేట నియోజకవర్గం నుండి కమ్యూనిస్టు అభ్యర్థిగాఎన్నిక, ఆంధ్ర శాసనసభ కమ్యూనిస్టుపార్టీ కార్యదర్శి, అడ్రెస్సు, సూర్యారావుపేట, విజయవాడ-2

## మేకా రంగయ్యప్పారావు

కాంగ్రెస్, నూజవీడు నియోజకవర్గం' జననం: 21-3-1915 విద్య: యం. ఎ. 1940 నుండి ఆంధ్ర మహాసభలో, కాంగ్రెస్‌లో, ఆంధ్రనాటక కళా పరిషత్తులో పని చేస్తు ఆంధ్ర మహాసభాధ్యక్షత, ఆంధ్రనాటక కళా పరిషత్ అధ్యక్షుడు, ఆంధ్ర ఒలింపిక్ అసోసియేషన్ అధ్యక్షుడు ఆంధ్రా యూనివర్సిటీ సెనెట్, సిండికేట్‌లలో 1942 నుండి ఇప్పటివరకు సభ్యుడు, 1949 నుండి శాసన సభ్యుడు, ప్రత్యేక అభిమానం: స్పోర్ట్సు రీడింగ్ ఫిజకల్ కల్చర్, థియేటరు. అడ్రెస్సు: నూజివీడు, పోస్టు, కృష్ణాజిల్లా.

## శ్రీమంతు రాజాయార్లగడ్డ శివ రామప్రసాద్ బహద్దర్

కాంగ్రెస్, దివి (జనరల్) నియోజక వర్గం, జననం: 29-9-1906 విద్య బి. ఎ. క్లాసువరకు, 1933-39 కృష్ణా జిల్లాబోర్డు ప్రెసిడెంటు, 1937 మద్రాసు శాసన సభకు జస్టిస్‌పార్టీ తరఫునఎన్నిక, 193 నుండి కొన్ని సంవత్సరములు ఆంధ్ర మహాసభ ఉపాధ్యక్షత, 1952 కృష్ణా లోయ మహాజన సంక్షేమ సంఘమునకు అధ్యక్షుడుగా ఉండి నందికొండ ప్రాజక్టుకు తీవ్రకృషి. అధ్యక్షుడు: ఆంధ్రా బ్యాంక్, హిందూస్థాన్ ఐడియల్ ఇన్సూరెన్సుకంపెనీ, ది.కె.సి.పి. లిమిటెడ్, వుయ్యూరు, మేనేజింగ్ డైరెక్టరు: ఆంధ్రా సైంటిఫిక్ కంపెనీ, చల్లపల్లి షుగర్సు, ప్రత్యేక అభిమానం: వ్యవసాయము, వ్యాపారము, రాజకీయాలు. అడ్రెస్సు: చల్లపల్లి కృష్ణాజిల్లా.



## మల్లెపూడి రాజేశ్వరరావు

కాంగ్రెస్: దివి (రిజర్వుడు) నియోజకవర్గం, జననం, 16-7-1925 విద్య: బి. ఎ. బి. యల్. పేదహరిజన కుటుంబములో జన్మించి విద్యార్థి వేతనముల సహాయముతోవిద్య నభ్యసించి 1951 లో ఏలూరునందు న్యాయవాద వృత్తి స్వీకరణ, 1947 నుండి ఆంధ్ర రాష్ట్ర చర్మకార సంఘానికి కార్యదర్శి, 1954 నుండి ఆంధ్ర ప్రదేశ్ నిమ్నజాతుల సమాఖ్యకు అధ్య



క్షుడు, 1953 రాష్ట్రప్రభుత్వ హరిజన సంక్షేమ సంఘానికి సభ్యుడు, 1951 ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థిగా ఎన్నికై, ఆంధ్ర శాసనసభలో కాంగ్రెస్ సభ్యుడుగా ఉంటూనే రాజధాని, హైకోర్టు సమస్యలలో ప్రభుత్వానికి వ్యతిరిక్తుడు. ప్రత్యేక అభిమానం: అంతర్జాతీయ రాజకీయాలు, హరిజనాభ్యుదయం. అడ్రెస్సు: లక్ష్మీవారపుపేట, ఏలూరు, పశ్చిమ గోదావరిజిల్లా.

## మాగంటి రామయ్య

కాంగ్రెస్, కంచికచర్ల నియోజకవర్గం,



వయస్సు: 54 విద్య: తెలుగు, 10 సం॥లుగా కాంగ్రెస్ సభ్యుడు, కొంత కాలం పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ కార్యకర్త, ప్రత్యేక అభిమానం, వ్యవసాయము, ఆడ్రెస్సు: జమ్మవరం, జుజ్జూరు పోస్టు, నందిగామ తాలూకా.

## కమ్మిలి అప్పారావు



కాంగ్రెస్, కైకలూరు: నియోజకవర్గం, జననం: 1918 విద్య: బి. ఎ. 1938లో బందరు నోబుల్ కాలేజీలో విద్యాభ్యాసం, 1939-1943 వరకు ఇంపీరియల్ బ్యాంకిలో పనిచేసి స్వచ్ఛంద జీవనాశక్తితో రాజీనామా. ప్రత్యేక అభిమానం, కొల్లేటిసీమ పురోభివృద్ధి. అడ్రస్సు: కైకలూరు, కృష్ణా జిల్లా.

## పేట బాపయ్య

కాంగ్రెస్, తిరువూరు నియోజకవర్గం, వయస్సు: 57 విద్య: స్కూలు ఫైనలు వరకు 1920 సం॥ నుండి కాంగ్రెస్ కార్యకర్త 1921 సం॥ లో 6 మాసాలు 30 సం॥ లో 2 సం॥లు 1932 లో 2 సం॥ లు 42 లో 3 సం॥లు జైలు శిక్ష. 1922 సం॥లో సబర్మతీ ఆశ్రమములో శిక్షణ.



పశ్చిమకృష్ణాజిల్లా సభ్యుడుగాను ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడుగాఉండి 1937-38 లో అధ్యక్షుడుగా ఉండి 48-50 కి పశ్చిమ కృష్ణాజిల్లా కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి. 1939 - 41 వరకు ఆంధ్రా ఫార్వర్డుబ్లాకులో కార్యకర్త. ప్రస్తుతం పశ్చిమకృష్ణాజిల్లా ఉపాధ్యక్షుడు. ప్రత్యేక అభిమానం: ప్రజాసేవ అడ్రెస్సు: దుర్గాపురం, విజయవాడ - 2

## వేముల కూర్మయ్య

కాంగ్రెసు: గుడివాడ (రిజర్వుడు) నియోజకవర్గం, జననం: 15-7-1907. విద్య: బి. ఎ. యల్. యల్. బి. 1921 లో సహాయ నిరాకరణోద్యమ సందర్భములో విద్యకు స్వస్తి, 1933 లో కాశీ హిందూ విశ్వ విద్యాలయములో బి. ఎ. 1936 లో యల్. యల్. బి. పట్టముల

స్థాపితము 17-1-1915 ఫోను నెం. 78

# నెం. 1422
# దికృష్ణాకోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు, లిమిటెడ్,
## బందరు

★

బ్రాంచి : భీమవరం

★

ప్రెసిడెంటు : శ్రీ కొల్లిపర వెంకటరమణయ్యనాయుడు B.A.BL., M.L.A.
వైస్ ప్రెసిడెంటు : శ్రీ వీరపనేని బాపయ్యచౌదరి, భూస్వామి.

★

| | |
|---|---|
| అనుమతిపొందిన మూలధనం | రూ 5,00,000 |
| వసూలైన మూలధనం | 4,29,362 |
| క్షేమనిధి | 3,00,633 |
| ఇతరనిధులు | 2,00,659 |
| గవర్నమెంటు అప్పుపత్రములు | 6,75,100 |
| డిబెంచర్లలోని మొత్తము | 1,54,400 |
| ఇతరములు | 7,58,03 |

ప్రస్తుతం అమలులోగల డిపాజిట్ల వడ్డీ రేట్లు

| | | |
|---|---|---|
| కరెంటు డిపాజిట్లు | | $\frac{1}{2}$% |
| సేవింగ్సు | | 2% |
| ఫిక్సెడ్ డిపాజిట్లు | 3 నెలలకు | $2\frac{3}{4}$% |
| | 6 | 3% |
| | 12 | $3\frac{1}{4}$% |
| | 24 అంతకుపైన | $3\frac{1}{2}$% |

ఆరు నెలలకు ఒకపర్యాయము వడ్డీ యివ్వబడును.

కార్యదర్శి,
శీలంశెట్టి శ్రీధరం, బి.ఏ, బి.కాం.



స్వీకారము, ఆది ఆంధ్రులలో ప్రథమ పట్టభద్రుడు, 1927 లో ఆంధ్రరాష్ట్ర ఆది ఆంధ్ర ఏడవ మహాసభ ఆహ్వాన సంఘ కార్యదర్శి శ్రీ అంజనీదేవి ఆది ఆంధ్ర బాలికల వసతి గృహస్థాపన, 1932 లో ఆంధ్రరాష్ట్ర హరిజన సేవక సంఘ కార్యదర్శి, కొంతకాలం సబర్మతీ ఆశ్రమము నందు శిక్షణ. ప్రస్తుతము ఆది ఆంధ్ర రాష్ట్ర సంఘమునకు అధ్యక్షుడు, జిల్లా బోర్డు మెంబరు, ఆంధ్ర విశ్వవిద్యాలయము సెనేట్ మెంబరు, అఖిల భారత హరిజన యువకుల సంఘమునకు అధ్యక్షుడు 1940 లో 6 మాసములు జైలుశిక్ష 1946-49 లో మద్రాసురాష్ట్ర హరిజన సంఘ సంక్షేమ మంత్రి, ప్రత్యేక అభిమానం, సంఘసేవ. అడ్రస్సు: దాసునగర్, విజయవాడ.

## అన్నుమిల్లి వెంకటసుబ్రహ్మణ్యం

స్వతంత్ర, గుడివాడ (జనరల్) నియోజకవర్గం, వయస్సు: 46 సం॥, విద్య: తెలుగు, ఇంగ్లీషు.



రెండుసార్లు, కృష్ణా జిల్లా బోర్డు మెంబరుగా, గుడివాడ మునిసిపల్ చైర్మన్ గా, 1951 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు కాంగ్రెస్ అభ్యర్థిగాను ఎన్నిక. డైరక్టరు, ఆంధ్రా ఇన్స్యూరెన్సు కంపెని, లిమిటెడ్, ది.కె.సి.పి. లిమిటెడ్ ఉయ్యూరు, ప్రత్యేక అభిమానం: వ్యవసాయం, అడ్రస్సు: సిద్ధాంతం, గుడివాడ తాలూకా, కృష్ణాజిల్లా.

## కొల్లిపర వెంకటరమణయ్య నాయుడు

కాంగ్రెస్, బందరు నియోజకవర్గం, జననం: 16-8-1888, విద్య: బి.ఎ. బి.యల్.



42 సం॥లుగా న్యాయవాది, రెండుసార్లు పబ్లిక్ ప్రాసిక్యూటరు, 25 సం॥లుగా బందరు పురపాలక సంఘ సభ్యుడు, రెండుసార్లు చైర్మన్ గా ఎన్నిక, రెండుసార్లు తాలూకా బోర్డు అధ్యక్షుడు, 15 సం॥ జిల్లాబోర్డు సభ్యుడు, అధ్యక్షుడు: కృష్ణా కోఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకి, బందరు కోఆపరేటివ్ స్టోర్సు కృష్ణాజిల్లా తెలగ సంఘం, రాష్ట్రీయ తెలగ మహాజన సంఘం, 10 సం॥లు బందరు బార్ అసోసియేషన్, డైరక్టరు: 20 సం॥లు మద్రాసు ప్రావిన్షియల్ కోఆపరేటివ్ బ్యాంకి, ఆంధ్రా బ్యాంకి, కృష్ణా అగ్రికల్చరల్ ఇంప్రూవ్‌మెంట్సు సొసైటీ, కృష్ణా జిల్లా కోఆపరేటివ్ సెంట్రల్ స్టోర్సు, సౌత్ ఇండియా కోఆపరేటివ్ ఫైర్ & జనరల్ సొసైటీ, లిమిటెడ్, మద్రాసు, 6 సార్లు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనెట్ కు మూడుసార్లు సిండికేట్ కి ఎన్నిక. బందరు హిందూ కాలేజి మేనేజింగు కమిటి, ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ వర్కింగ్ కమిటి, ఆంధ్ర జాతీయ కళాశాల మేనేజింగు



# ఫ్లవర్ డైమండ్ హాల్

విజయవాడ - 1



ప్రొప్రయిటరు :

మారోజు వెంకటరత్నం అండ్ సన్సు



మా వద్ద అన్ని రకముల ఫ్లవర్ వజ్రములు రియల్ ఆర్టు వజ్రములు పంచరంగుల డబుల్ కట్టింగ్, ఫ్లవర్ వజ్రములు, శరత్కాల వెన్నెలను హైమరపించి, చంద్రకాంతిని చెదరగొట్టి, పంచరంగులలో ప్రకాశించి, ఆభరణములకు, అందం పెంపొందాలంటే ఫ్లవర్ వజ్రములనే వాడండి.

షరా :- బంగారువగలు గ్యారంటీగా చేయించబడును. ఒకసారి దయచేసిన మీకే విశ్వాసమగును.

---

# బాలప్రవర్ధని

పిల్లల జలుబు, జ్వరము, కడుపుబ్బ మొదలగువానికి 50 మాత్రలు రూ 1-0-0



శాస్త్రీయమైన రెండువందల రకముల ఆయుర్వేదౌషధములు దొరకును.



కేటలాగు, వైద్యసలహా ఉచితము



'వైద్యరాజ'

లక్కావఝల వెంకటేశ్వర్లు

గోపాలకృష్ణ ఆయుర్వేదఫార్మశి

గాంధీనగరం – విజయవాడ-2

---



For Delicious Vegetarian Meals

★ VISIT ★

# Neo Garden Cafe

Post office Road, KURNOOL

Branch at Budhavarpet.



కమిటి, భూసంస్కరణల కమిటీ సభ్యుడు విక్టోరియా మెమోరియల్ టౌన్‌హాల్ & లైబ్రరీకి మూడుసార్లు కార్యదర్శిగా ఎన్నిక, యుద్ధకాలంలో 'వార్ కమిటీ మెంబరు', 1945 లో రావ్‌బహుద్దర్ బిరుదు ప్రదానం, అడ్రెస్సు : బందరు, కృష్ణాజిల్లా.

## వెల్లంకి విశ్వేశ్వరరావు

కమ్యూనిస్టు : మైలవరం, నియోజక వర్గం, జననం : 1917, 1937 లో మునగాల పరగణా రైతు సంఘం జమీందార్ వ్యతిరేక ఉద్యమము ద్వారా రైతుల కష్టాలు ప్రభుత్వ దృష్టికి తెచ్చుట, 1939 లో గృహ నిర్బంధ జీవితం, 1945 లో $2\frac{1}{2}$ సం॥



డిటెన్యూ 1948 తిరిగి $2\frac{1}{2}$ సం॥ జైలు జీవితం, 1952 నుండి విజయవాడ సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంక్ డైరెక్టరు, ప్రత్యేక అభిమానం : రైతుకూలీ సంఘాలు, ప్రజా సమస్యలు, సహకారోద్యమము, అడ్రస్సు: ప్రజాశక్తినగర్, బకింగ్‌హాంపేట, పోస్టు, విజయవాడ. 2.

## పిన్నెంటి పమిడేశ్వరరావు

కాంగ్రెస్, మల్లేశ్వరం నియోజకవర్గం, జననం : 1917, 1941 నుంచి సహకారోద్యమ కార్యకర్త బంటుమిల్లి కో ఆపరేటివ్ యూనియన్ కు డైరక్టరు, కృష్ణా సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంకి డైరక్టరు, 1949-53 కృష్ణా జిల్లాబోర్డు మెంబరు, 1951 నుండి తూర్పు కృష్ణాజిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సంఘసభ్యుడు, అడ్రెస్సు : మునిపెడ, బంటుమిల్లి పోస్టు కృష్ణాజిల్లా.

## చాగర్లమూడి రామకోటయ్య

కాంగ్రెస్, కంకిపాడు నియోజకవర్గం, వయస్సు : 38 సం॥, 5 సం॥ లు పంచాయితీబోర్డు ప్రెసిడెంటు, ప్రత్యేక అభిమానం: రైతుకూలీ ఉద్యమము, అడ్రస్సు: రొయ్యూరు, మద్దూరుపోస్టు, కృష్ణాజిల్లా.

---

# గుంటూరు జిల్లా

## తెల్లాకుల జాలయ్య.

కాంగ్రెస్, గుంటూరుపట్టణ నియోజకవర్గం, జననం :- 29-5-1896 ది 14-5-38 నుండి 31-3-47 వరకు గుంటూరు పురపాలక సంఘ అధ్యక్షుడు, ది 1930 నుండి ఇప్పటివరకు పురపాలక సంఘంలో సభ్యుడు, గుంటూరు హోల్ సేల్ కోఆపరేటివ్ స్టోర్సు స్థాపన, మొదటి అధ్యక్షత, శ్రీ కన్యకా పరమేశ్వరీసత్రం, అధ్యక్షుడు, గుంటూరుజిల్లా రైస్ మిల్సు అసోసియేషన్ అధ్యక్షుడు, గుంటూరు జిల్లా సేల్సుటాక్సు అస్సెస్సీస్ అసోసియేషన్ అధ్యక్షుడు, ప్రత్యేక అభిమానం :- వర్తకము, సంఘఐక్యత. అడ్రస్సు :- భువనేశ్వరీ రైస్ మిల్, పోస్టుబాక్సు, 48 గుంటూరు, ఫోను 129, టెలిగ్రాం: కామధేను.



## మేడూరి నాగేశ్వర రావు.

కాంగ్రెస్, గుంటూరుగ్రామీణ నియోజకవర్గం, జననం :- 31-3-1910, విద్య ఎ. సి. కాలేజి-గుంటూరు, 1930 రాజకీయ రంగప్రవేశం, 1935-40 గుంటూరు జిల్లాకాంగ్రెస్ సహాయకార్యదర్శి, 1940-51 రాష్ట్రకాంగ్రెస్ సభ్యులు, 1942 వ్యక్తి సత్యాగ్రహంలో జైలుశిక్ష, 1947-52 మద్రాసుశాసనసభ సభ్యులు, 1954 జూన్-54 నవంబరు ఆంధ్ర శాసనసభకు జరిగిన ఉపఎన్నికలో దుగ్గిరాల నియోజకవర్గంనుండి ఎన్నిక, 1948-54 ఇండియన్ సెంట్రల్ టుబాకో కమిటీసభ్యుడు, రాష్ట్ర వ్యవసాయ కళాశాల సెలక్షన్ కమిటీసభ్యుడు, 1951-54 అఖిలభారత వ్యవసాయ పరిశోధన కేంద్రసభ్యులు, 1948-53 గుంటూరుజిల్లా ఆంధ్రమహాసభాధ్యక్షులు, ప్రత్యేక అభిమానం :- వ్యవసాయము, సాంఘిక సేవ. అడ్రస్సు :- ఏటుకూరు, పోస్టు, గుంటూరుజిల్లా.



## జాగర్లమూడి చంద్రమౌళి.



కాంగ్రెస్, అమ్మనబ్రోలు నియోజకవర్గం, జననం:-3 జులై 1914, విద్య బి.ఏ. బి.యల్. అధ్యక్షుడు :- గుంటూరుడిస్ట్రిక్టు హోల్ సేల్

కో-ఆపరేటివ్ స్టోర్సు, గుంటూరు కో-ఆపరేటివ్ అర్బన్ బ్యాంక్, గుంటూరు కో-ఆపరేటివ్ హౌస్ కన్‌స్ట్రక్షన్ సొసైటీ, యస్. వి. ఆర్ & పద్మన్సక్లబ్. ప్రత్యేక అభిమానం :- సహకార సంస్థలు, క్రికెట్, టెన్నీస్. అడ్రసు :- 14 వ లైను, అరండల్ పేట, గుంటూరు, 2, ఫోను నెం. 156.

## టంగుటూరి ప్రకాశం.

కాంగ్రెస్, ఒంగోలు (జనరలు) నియోజకవర్గం జననం :- 23-8-1872 విద్య,



బి. ఏ. బి. యల్. బ్యారిస్టర్ ఎట్ లా, 1891 రాజమండ్రి మునిసిపల్ ఛైర్మన్, 1907 సూరత్ కాంగ్రెస్ డెలిగేటు గాంధీజితో పరిచయం, 1919 మహానంది లో జరిగిన ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెస్ అధ్యక్షత, 1921 వకాల్తా జీవితం స్వస్తి. నవంబరులో 'స్వరాజ్యపత్రిక' స్థాపన, 1926 కేంద్ర శాసనసభసభ్యుడు, 1928 మద్రాసు హైకోర్టు ఎదుట సైమన్‌కమిషన్ బహిష్కరణ, 1931 మద్రాసులో "ఉదయవనం" లోను స్వగ్రామమైన "దేవరంపాడు" లోను ఉప్పు సత్యాగ్రహంచేసి, గుంటూరులో అరెస్టు, గుంటూరు ఆంధ్ర రాజకీయ మహాసభ అధ్యక్షత, 1937 రాజాజీ మంత్రివర్గంలో రెవెన్యూ మంత్రి, జమీందారీ విచారణకమిటీ అధ్యక్షత, 1940 మంత్రిపదవికి రాజీ. 17-10-40 వ్యక్తి సత్యాగ్రహంలో పాల్గొని అరెస్టు, 1942 ఆగస్టు ఉద్యమములో బొంబాయి ఏ. ఐ. సి. సి. నుండి వస్తూ కడపలో అరెస్టు, 1-5-1946 మద్రాసు ప్రధాని పదవి, 1947 రాజ్యాంగ నిర్మాణ సభ సభ్యుడు, 1950 కాంగ్రెస్ నుండి రంగాగారితో విడిపోయి ప్రజాపార్టీ స్థాపన, 1952 "శృంగవరపు కోట" నియోజకవర్గంనుండి, ప్రజాసోషలిస్టుపార్టీ తరఫున మద్రాసు శాసనసభకు ఎన్నిక, ఏప్రియల్ లో 'డెమాక్రెటిక్ ఫ్రంట్ నాయకునిగా ఎన్నిక, 1952 "ప్రజాపత్రిక" ఇంగ్లీషు వారపత్రిక ప్రారంభం, మద్రాసులో, జరిగిన ఆంధ్ర కాన్ఫరెన్సు అధ్యక్షత, 1953 1 అక్టోబరున ఆంధ్రరాష్ట్ర స్థాపన, జరిగిన తరువాత ప్రథమ ఆంధ్రరాష్ట్ర ముఖ్యమంత్రిపదవి, అనేక సంవత్సరాలు ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షత, ఏ. ఐ. సి. సి. సభ్యత్వం, ప్రత్యేక అభిమానం :- ఆంధ్ర ప్రజలు, ప్రకృతివైద్యం, అడ్రసు :- ఒంగోలు, గుంటూరుజిల్లా.

## గింజుపల్లి బాపయ్య.



కాంగ్రెస్, పెదకాకాని నియోజకవర్గము, విద్య : స్కూలు ఫైనలు, గుంటూరుజిల్లా గ్రామోద్యోగుల సంఘాధ్యక్షుడు, గుంటూరు తాలూకా గ్రామోద్యోగుల విశ్రాంతిభవననిర్మాణము, ప్రకృతి ఆశ్రమ నిర్మాత, 25 సం. లుగా

రాజకీయజీవితం, ప్రత్యేక అభిమానం: ప్రకృతి వైద్యం, అడ్రసు: ప్రత్తిపాడు గుంటూరు తాలూకా.

## మేకా కోటిరెడ్డి

కాంగ్రెస్: మంగళగిరి నియోజకవర్గం, వయస్సు: 51 సం, విద్య: హిందీ, తెలుగు, 1937 గుంటూరు జిల్లా కాంగ్రెస్ కార్యదర్శి, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సభ్యుడు, గుంటూరుజిల్లా రాజకీయమహాసభ ఆహ్వాన సంఘాధ్యక్షులు, ఇండిపెండెన్సు ఆఫ్ ఇండియా లీగ్ సభ్యుడు, రెండుసార్లు జాతీయోద్యమాలలో, జైలుశిక్ష, పెనుమాకలో గ్రంథాలయస్థాపకులు, ప్రత్యేక అభిమానం: గ్రంథాలయోద్యమము, అడ్రసు: పెనుమాక, (వయా) మంగళగిరి.



## కాసు బ్రహ్మానందరెడ్డి

కాంగ్రెస్: ఫిరంగిపురం నియోజకవర్గం, జననం: 28-7-1909, విద్య: బి.ఎ.బి.యల్, 1936-1937 జిల్లా బోర్డు అధ్యక్షుడు, 1946-1952 మద్రాసు శాసనసభ్యుడు, 1946 నుండి, అఖిల భారత కాంగ్రెస్ కమిటీ మెంబరు, అడ్రసు: కొరిటిపాడు రోడ్డు, గుంటూరు-2



## మంతెన వెంకటరాజు

కాంగ్రెస్: బాపట్ల నియోజకవర్గం, జననం: 20-5-1904, విద్య: 6వ ఫారం, 1921లో కాంగ్రెస్‌లో జేరి పన్నుల నిరాకరణోద్యమములో జైలు శిక్ష, 1926 నుండి కోఆపరేటివ్ ఫెడరేషన్ డైరక్టరుగా, సెంట్రల్ కో-ఆపరేటివ్ బ్యాంకి డైరక్టరుగా, కో-ఆపరేటివ్ యూనియన్ డైరక్టరుగా, 1929 మంతెనవారిపాలెంలో జిల్లారాజకీయసభల నిర్వాహకులు 1930లో 9 మాసములు 1931లో 1 సం. శిక్ష, 1934 జిల్లాబోర్డు సభ్యునిగా ఎన్నిక, 1939-46 జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు, 1940-46 రాష్ట్రకాంగ్రెస్ సహాయ కార్యదర్శి, 1941 వ్యక్తి సత్యాగ్రహం నిర్వహణ, 1942లో 2½ సం, డిటెన్యూగా శిక్ష, 1946 ఉమ్మడి మద్రాసురాష్ట్ర శాసనసభ్యుడుగా ఎన్నిక, అడ్రసు: మంతెనవారిపాలెం, (వయా) పొన్నూరు.



## నల్లపాటి వెంకటరామయ్య

కాంగ్రెస్: నరసరావుపేట, నియోజకవర్గం, జననం: 1901 విద్య: బి.ఎ.బి.యల్ 1930 నరసరావుపేట మునిసిపల్ ఛైర్మన్, 1930 - 31 ఆంధ్ర విశ్వవిద్యాలయ సెనెట్ సభ్యుడు, 1952లో ప్రజాపార్టీ అధ్య



## కళోదయ ట్యుటోరియల్ కాలేజి

బ్రాడీపేట : : 3వ లైను : : గుంటూరు

తరగతులు :

మెట్రిక్, యస్. యస్. యల్. సి.

ఇంటర్ & బి. ఏ. (సెప్టెంబర్ & మార్చి)

జూనియర్ & సబ్ జూనియర్ మెట్రిక్ తరగతులుకూడా.

లోగడ పరీక్షా ఫలితాలు—80%

ప్రిన్సిపాల్ : ఆర్. కె. శాస్త్రి

---

## ప్రభాత్ వాచ్ కంపెని

బ్రాడీపేట : : గుంటూరు 2.



రిజిష్టర్డు డీలర్లు వెస్టెండ్, ఫేవర్ లూబా వాచీలకు మావద్ద రిపేర్లు చేయబడును, యింగ్లీషు స్పేరులు, అన్ని రకముల గడియారములు దొరుకును.

ధరలు బహుసరసముగా నుండును

రిపేరింగు స్పెషాలిటి

---

*Wisely Choose*

# RATNAM PEN

*For*

* Writing Comfort

* Longer Life

* Durability



*Manufacturers :*

**K. V. RATNAM & Bros,**

**RAJAMUNDRY.**

నర్సరావుపేట నియోజకవర్గం నుండి ్రాసుశాసనసభకు ఎన్నిక, ఆంధ్ర ట్రం ఏర్పడిన తరువాత మొదటి ఆంధ్ర శాసనసభా స్పీకరుగాఎన్నిక. అడ్రెస్సు: అడ్వకేటు, నర్సరావుపేట, గుంటూరు జిల్లా.

## మండవ బాపయ్యచౌదరి

కాంగ్రెస్: గురజాల నియోజకవర్గం, జననం: 9-5-1921, విద్య: బి.ఎ.బి.యల్. 1952లో సంయుక్త మద్రాసు శాసనసభకు సభ్యుడుగా ఎన్నిక, అధ్యక్షుడు గాంధీ సేవక హరిజనహాస్టలు - గురజాల, ప్రత్యేక అభిమానం : పల్నాడు, వినుకొండ తాలూకాలలో, హరిజన, సుగాలి (లంబాడి) జాతుల ఉద్ధరణ, అడ్రెస్సు : అడ్వకేటు, గురజాల.



## గణపా రామస్వామిరెడ్డి

కాంగ్రెస్: పెదకూరపాడు, నియోజకవర్గం, జననం: 31-8-1926, విద్య: బి.ఎ. వరకు 1942 - 51 విద్యార్థి కాంగ్రెస్‌లో సభ్యుడు 1949 ఆంధ్రరాష్ట్ర విద్యార్థి కాంగ్రెస్ కార్యదర్శి, 1954 గుంటూరు జిల్లా నాటు పొగాకు ఉత్పత్తిదారులసంఘ కార్యదర్శి, అడ్రెస్సు, మంగోష్, సత్తెనపల్లితాలూకా.



## కల్లూరి చంద్రమౌళి

కాంగ్రెస్: వేమూరు నియోజకవర్గం, వయస్సు: 56, విద్య: స్కాట్లండులోని వ్యవసాయ శాస్త్ర పట్టభద్రుడు, 1926 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, అన్ని జాతీయోద్యమాలలోను పాల్గొని జైలుశిక్ష, 1937 లోను 1946 లోను మద్రాసు శాసనసభకు ఎన్నిక, 1947, 52, వరకు, మద్రాసురాష్ట్ర శాసనసభకు ఎన్నికై, స్థానిక పరిపాలనామంత్రి, 1954, జనవరి నుంచి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెసు ప్రధాన కార్యదర్శి, 1955 మార్చి 28 వ తేదీ ఉదయం 11 గంటల 7 నిమిషములకు, మంత్రి పదవి ప్రమాణ స్వీకారము, అనేక సంవత్సరాలు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ సభ్యులు, గుంటూరు జిల్లాబోర్డు అధ్యక్షుడు, అడ్రెస్సు: సెక్రెటేరియట్, కర్నూలు.



## వావిలాల గోపాలకృష్ణయ్య

సత్తెనపల్లి, నియోజకవర్గం, వయస్సు, 46సంవత్సరాలు, 1920 - 28 రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ మెంబరు. 19:6-35 సంపాదకుడు, 'విద్యార్థి' — 'జ్యోతి,' 1929-32 ఆంధ్రపత్రిక సహాయ సంపాదకుడు,ఖద్దరు కో-ఆపరేటివ్ యూనియన్, కార్యదర్శి, 1938 - 40 గ్రామపునరుద్ధరణ

స్థాపితము 1910. పోస్టుబాక్సు నెం. 6. ఫోను నెం. 70.

# నెం. 530, ది గుంటూరుజిల్లా కో ఆపరేటివ్ సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్., తెనాలి.

(హెడ్ ఆఫీసు : తెనాలి, బ్రాంచిఆఫీసులు : గుంటూరు, ఒంగోలు)

ప్రెసిడెంటు :- శ్రీ ఆలపాటి వెంకటామయ్య, యం. యల్. ఏ.

30-6-1954 తేదీన

| | |
|---|---|
| శాంక్షను అయిన మూలధనము | రు. 20,00,000/- |
| చందా వేయబడిన మూలధనము | 11,29,500/- |
| వసూలైన మూలధనము | 5,81,505/- |
| డిపాజిట్లు | 67,64,035/- |
| వర్కింగ్ కాపిటల్ | 78,40,995/- |
| రిజర్వులు | 4,91,968/- |

డిపాజిట్లు యీక్రింద ఉదహరించిన రేట్లకు తీసుకొనబడును

| | | |
|---|---|---|
| 1. | కరెంటు డిపాజిట్లు రు 10,000/- నిల్వవరకు | కనీసపు డిపాజిట్టు రూ 25/- 1/4% P. A. |
| 2. | సేవింగ్సు డిపాజిట్లు | 2% రూ 5/- వారమునకు రెండు పర్యాయములు రు 500 లకు మించకుండా తీసుకోవచ్చును. |
| 3. | రికరింగు డిపాజిట్లు | 3% రు 1 మొదలు రు. 25 వరకు |
| 4. | ఫిక్సెడు డిపాజిట్లు | |
| | 3 నెలలు, అంతకుపైన | 2 3/4% P. A. |
| | 6 ,, | 3% ,, |
| | 12 ,, | 3¼% ,, |
| | 24 ,, | 3½% ,, |
| | 36 ,, | 3 3/4% ,, |

(6 నెలలకు పైబడిన డిపాజిట్లకు వడ్డీ ఆరునెలల కొక పర్యాయము యివ్వబడును.)

వివరములు :

సెక్రటరి, గుంటూరుజిల్లా కో ఆపరేటివు సెంట్రల్ బ్యాంకు లిమిటెడ్., తెనాలికిగాని, లేదా బ్రాంచిమేనేజర్లు: 1. బ్రాడీపేట-గుంటూరుకుగాని, 2. ఒంగోలుకుగాని వ్రాసి తెలుసుకొనవచ్చును.

బి. పాపారావు
సెక్రెటరి.



సంఘ సభ్యుడు, జిల్లా హరిజన్ సేవా సంఘ సభ్యుడు, జిల్లా కాంగ్రెస్ జాయింటు కార్యదర్శి, 1936-37 జిల్లాసివిక్ బోర్డు మెంబరు, 1938-50 ఆంధ్ర దేశ గ్రంథాల సంఘ కార్యదర్శి, 1945 ఆంధ్ర రాష్ట్ర కోపరేటివ్ యూనియన్ "సహకారం" పత్రికా సంపాదకుడు, 1938-45 గుంటూరుజిల్లా యానాది సంఘఅధ్యక్షుడు, 1945 తెలంగాణా సహాయ కమిటి కార్యదర్శి, ఆంధ్రరాష్ట్ర కమ్యూనిస్టు కమిటీ మెంబరు, 1948 రాష్ట్ర కాంగ్రెస్ చే నియమించబడిన సర్కారు రాయలసీమ సంప్రదింపుల కమిటీలో సభ్యుడు, 1949 రాష్ట్ర సమస్యలపై ఆంధ్ర మహాసభ తరఫున కేంద్రంవద్దకు వెళ్లిన రాయబార సభ్యుడు, 1950 గుంటూరుజిల్లా జర్నలిస్టు అసోసియేషన్ అధ్యక్షుడు 1950-51 జర్నలిజంపై నడిపిన స్కూల్ ప్రిన్సిపాల్ 1951 అఖిలపక్ష ఆంధ్ర కన్వెన్షన్ కు కార్యదర్శి ఆంధ్రరాష్ట్ర శాంతి మహాసభ అధ్యక్షుడు, 1952 సత్తెనపల్లి నియోజకవర్గం నుండి స్వతంత్ర అభ్యర్థిగా మద్రాసు శాసనసభకు ఎన్నిక, 1930-32 సత్యాగ్రహోద్యమాలలో 1933 బెంగాల్ సెక్యూరిటీ చట్టంక్రింద 1939 యుద్ధప్రయత్నాలను వ్యతిరేకించినందుకు 1942 ఆగస్టులో జాతీయోద్యమములో 1948 ఆగస్టు 9 న స్వాతంత్ర్యోత్సవం జరిపిన సందర్భములోను 1948లో డిటైనుచేసి 1950 ఏప్రియల్ లో అరెస్టు చేసింది, మొత్తం జైలు శిక్ష గడిపినది 6 సంవత్సరాలు. ప్రత్యేక అభిమానం: ప్రాజెక్టులు, నిర్మాణ కార్యక్రమము అడ్రెస్సు: సత్తెనపల్లి, గుంటూరు జిల్లా.

## ఆలపాటి వెంకట్రామయ్య

కాంగ్రెస్ : తెనాలి నియోజకవర్గం

జననం: 9-9-1917 విద్య, తెలుగు, సంస్కృతము మొదటినుండి కాంగ్రెసు కార్యకర్త జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యుడు 1951లో మద్రాసు శాసనసభకు ఎన్నిక,



తిరుపతిదేవస్థాన కార్యనిర్వాహకవర్గ సభ్యుడు గుంటూరుజిల్లా సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకి అధ్యక్షుడు ప్రత్యేకాభిమానం: సహకార సంఘోద్యమము, అడ్రెస్సు: కొత్తపేట, తెనాలి, గుంటూరుజిల్లా.

## గోవాడ పరంధామయ్య

కాంగ్రెస్ : పొన్నూరు నియోజకవర్గం

జననం, 16-6-1919 విద్య, బి. యల్. చదివి పట్టాపుచ్చుకొనలేదు, రైతుకూలి ప్రజారాజ్య స్థాపనకు రంగాగారి నాయకత్వం క్రిందకృషి, ప్రత్యేక అభిమానం: రైతుసేవ, అడ్రెస్సు: పొన్నూరు.



## ప్రగడ కోటయ్య

కాంగ్రెస్ : చీరాల నియోజకవర్గము జననం 26-7-1915 విద్య, యస్. యస్. యల్.సి. 1934-36 మద్రాసు చేనేత కళాశాల సూపర్ వైజర్సు కోర్సులో మొదటి తరగతిలో ఉత్తీర్ణత సిటీ అండ్ గిల్డ్సు, లండన్ ఇన్‌స్టిట్యూట్ తాలూకు పరీక్షలో ఇండియాలో ప్రథముడుగా ఉత్తీర్ణత 1937-39 చెన్నరాష్ట్ర చేనేత సహకార సంఘంకింద డిజైనరు, మార్కెటింగ్ ఆఫీసరు సూపర్ వైజరుగా ఉద్యోగం 1940లో రాజీనామా చేసి చేనేత ఉద్యమములో ప్రవేశం, 1942 నుండి చెన్నరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కార్యదర్శి ఆంధ్రరాష్ట్రము విడిపోయిన తరువాత ఆంధ్రరాష్ట్ర చేనేత కాంగ్రెస్ కార్యదర్శి 1945 - 50 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యుడు 1947 అఖిల భారత చేనేత కాంగ్రెసుకు ప్రధాన కార్యదర్శి 1948 - 49 ఇండియా ప్రభుత్వం ఏర్పాటు చేసిన చేనేత స్థాయీ సంఘంలో సభ్యుడు 1949 - 53 మద్రాసు ప్రభుత్వంచే నియమించ బడిన రాష్ట్ర చేనేత బోర్డులో సభ్యుడు జిల్లా చేనేత బోర్డు ఉపాధ్యక్షుడు 1950లో రాష్ట్ర మంతటా ఆకలి యాత్రలు సత్యాగ్రహములు 1951లో మద్రాసులో 75రోజులు పాటు సాగించిన చేనేత సత్యాగ్రహమునకు నాయకత్వం 1952 చీరాల నియోజకవర్గం కిసాన్ మజ్దూర్ ప్రజాపార్టీ తరఫున మద్రాసు శాసనసభకు ఎన్నిక 1953 రేపల్లె తాలూకా చేనేత కాంగ్రెస్ రేపల్లెలో సాగించిన సత్యాగ్రహంలో పాల్గొని 6 నెలలు కఠినశిక్ష 1954 ఆంధ్రప్రభుత్వం నియమించిన రాష్ట్ర చేనేత బోర్డులో సభ్యుడు రాష్ట్రఖాదీ గ్రామపరిశ్రమల బోర్డులో సభ్యుడు ప్రత్యేక అభిమానం: చేనేత పరిశ్రమ, అడ్రస్సు: నిడుబ్రోలు గుంటూరు జిల్లా



## బండ్లమూడి వెంకట శివయ్య

కాంగ్రెస్, మార్టూరు నియోజకవర్గం, జననం:1926, విద్య: బి. యస్. సి., గుంటూరు ఎ. సి. కాలేజి, 1952 నుండి గుంటూరుజిల్లా కృషికార్ లోక్ పార్టీ కార్యదర్శి, ప్రత్యేక అభిమానం: సాంఘిక సేవ, అడ్రస్సు: నారాకోడూరు (పోస్టు) వయా తెనాలి.



## నాగినేని వెంకయ్య

కాంగ్రెస్ : అద్దంకి : నియోజకవర్గం, వయస్సు: 44 సం॥ గ్రామ మునసబు, 1930 మొదలు కాంగ్రెస్ సభ్యుడు, జమీన్ రైతు ఉద్యమ కార్యకర్తగా పనిచేయుచూ ఉద్యోగ విరమణ, 1936 – 46 వరకు



మీా జీవితభీమాలకు

## ది మెట్రోపాలిటన్ ఇన్స్యూరెన్సు కంపెనీ, లిమిటెడ్

స్థాపితము : 1930

హెడ్డాఫీసు : కలకత్తా

బ్రాంచి ఆఫీసులు

గాంధీనగరం
విజయవాడ – 2.

52, 53 తంబుచెట్టివీధి
మద్రాసు - 1.

1954 లో పదికోట్ల ఇరువైలక్షలు జీవితభీమా మించినది

పలుకుబడి, సామర్థ్యతగలఏజంట్లు అన్ని ప్రాంతములందు కావలెను

వివరములకు :

ఇన్స్పెక్టరేట్ ఆఫీసు

అరండల్ పేట, 9వ లైను, గుంటూరు – 2.

ఫోను నెం. 668

---

గుడ్డలకు మిత్రుడు, మురికికి శత్రువు

## వైటుహార్సు వాషింగ్ సోప్




*Use our favourite*

**WHITE HORSE**

**SOAP**

**வைட்ஹார்ஸ்**

**சோப்**

**MURALI SOAP WORKS, MADRAS-21**

డిస్ట్రిబ్యూటర్సు : ఆంధ్రజిల్లాలకు, శివకోటి లక్ష్మీనరసింహం

మార్కెట్ స్క్వేర్ – విజయవాడ – 1.

జమీన్ రైతుసంఘ కార్యదర్శి 46 నుంచి అధ్యక్షులు 1938 లో పోటీ లేకుండా జిల్లాబోర్డుకు ఎన్నిక మరల 51 లో ఎన్నిక 1940 లో 6 మాసములు జైలుశిక్ష. 20 సంవత్సరములనుండి ఆంధ్ర దేశ గ్రంథాలయ సంఘ ఉపాధ్యక్షుడు. గతంలో ఆంధ్ర కృషీకార్ లోక్ పార్టీ కోశాధికారి. నేషనల్ బ్లాక్ ఎక్స్‌టెన్షన్ కమిటీ సభ్యుడు, ప్రత్యేక అభిమానం: గ్రంథాలయ, రైతు ఉద్యమాలు, అడ్రసు: ఫేనువుకొండ పోస్టు, ఒంగోలు తాలూకా.

## తాళ్లూరి జియ్యర్ దాసు



కాంగ్రెస్: ఒంగోలు (రిజర్వుడు) నియోజకవర్గం, జననం: 16-4-1909 విద్య: యస్. యస్. యల్. సి. సెకండరీ ట్రయినింగ్, 1931 లో రాజకీయాలలో ప్రవేశం, 33 లో తాళ్ళపాలెమునందు హరిజనులకు శ్రీరామ మందిరస్థాపన, 35 లో చీరాలలో ఆయుర్వేద వేసంగి పాఠశాలనిర్వహణ 48 నంద్యాలయందు ఆయుర్వేదకళాశాల స్థాపన, అఖిల భారత ఆయుర్వేద-యునానీ అనువంశిక వైద్య సంఘ కార్యదర్శి, 9 సం॥ లు సెంట్రల్ బోర్డు ఆఫ్ ఇండియన్ మెడిసన్ సభ్యుడు, గుడివాడ యందలి మాతా శిశు సేవా చికిత్సాలయ కార్యదర్శి, ఇడుపులపాటి విద్యాపరిషత్ ధర్మకర్త, ఆంధ్ర హరిజన సంఘ సంయుక్త కార్యదర్శి. అఖిలభారత నిమ్న జాతుల సంఘ ఉపాధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్రవ్యవసాయ సంఘ కార్యదర్శి, ఇండియన్ కౌన్సిలు ఆఫ్ అగ్రికల్చరల్ రిసర్చి సభ్యుడు, ప్రత్యేక అభిమానం: హరిజనోద్ధరణ. ఆయుర్వేద వ్యాప్తి, అడ్రసు: తాళ్ళపాలెము, ఆరేమండ పోస్టు, వయా, పొన్నూరు.

## అనగాని భగవంతరావు



కాంగ్రెస్: కూచినపూడి, నియోజక వర్గం, జననం, 1-7-1953, విద్య: ఎం.ఎ.ఎల్.ఎల్.బి. గుంటూరు జిల్లా కల్లుగీత సత్యాగ్రహ కార్యాచరణ సంఘమునకు అధ్యక్షుడు రేపల్లె కళాశాల సంఘములో సభ్యుడు ప్రత్యేక అభిమానం: వెనుకబడిన జాతుల సముద్ధరణ. సంస్కృతిక సంఘముల స్థాపన, అడ్రసు: అడ్వకేటు, రేపల్లె, గుంటూరుజిల్లా.

## కొల్లా రామయ్య



కాంగ్రెస్: పరుచూరు, నియోజకవర్గం, జననం: 8-4-1925, ప్రత్యేక అభిమానం: పుస్తక పఠనం, అడ్రసు: నాగులపాలెం, వుప్పుటూరు పోస్టు, వయా, చీరాల.

## పుతుంబాక శ్రీరాములు

కాంగ్రెస్ : దుగ్గిరాల, నియోజకవర్గం :



వయస్సు : 45 సం॥ విద్య, స్కూలు ఫైనలు ఇదివరలో ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ సహాయ కార్యదర్శి, గుంటూరు జిల్లా బోర్డు మెంబరు ప్రస్తుతం రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడు అడ్రస్సు, పెద్దపాలెం, తెనాలితాలూకా.

## నలబోలు గోవిందరాజులు

కాంగ్రెస్ : వినుకొండ, నియోజకవర్గం, జననం : 1913 విద్య : యస్.యస్.యల్.సి. 1936లో జిల్లాబోర్డు సభ్యుడు, జిల్లాఫుడ్ కమిటీ సభ్యుడు, 6 సం॥ గ్రామ పంచాయితీ అధ్యక్షుడు, తాలూకా రైతు కాంగ్రెస్ అధ్యక్షుడు, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కమిటీ సభ్యుడు, ప్రత్యేక అభిమానం : రైతుకూలీ ప్రజా ఉద్యమాలు, అడ్రస్సు : కొండ్రముట్ల, వినుకొండ తాలూకా, గుంటూరు జిల్లా.

## యాదం చెన్నయ్య

కాంగ్రెస్ : రేపల్లె, నియోజకవర్గం, వయస్సు : 34 సం॥ 10 సంవత్సరాలు కారుమూరు పంచాయితీబోర్డు అధ్యక్షుడు ప్రత్యేకఅభిమానం : గ్రామపంచాయితీలు, అడ్రస్సు : కారుమూరు పోష్టు.

## మందపాటి నాగిరెడ్డి

కమ్యూనిస్టు : మాచర్ల, నియోజకవర్గం, జననం: 1922



విద్య : స్కూలు ఫైనలు, సెకండ్ గ్రేడు ట్రయినింగ్, పల్నాడుతాలూకా నడికూడె గ్రామమునసబుగా పని చేస్తూ 1942 క్విట్ ఇండియా ఉద్యమములో పాల్గొన్నందుకు ఉద్యోగనుండి సస్పెన్షన్. 1948 సం॥ లో కమ్యూనిస్టు పార్టీతో సంభంధం కారణంగా మూడు సంవత్సరాలు జైలుశిక్ష, 19F3 లో నడికూడె పంచాయితీకి కమ్యూనిస్టు అభ్యర్థిగా పోటీ లేకుండా ఎన్నిక, ఇదివరలో జిల్లా రైతు సంఘ సహాయ కార్యదర్శి. నందికొండ ప్రాజెక్టు కమిటీ సహాయ కార్యదర్శి, ప్రస్తుతం, జిల్లా కమ్యూనిస్టుపార్టీ సభ్యుడు, తాలూకాపార్టీ కార్యదర్శి, ఆంధ్రా సిమెంటుకంపెనీ యంప్లాయిస్ యూనియన్ బ్రాంచి నడికూడెసైన్సు కార్యదర్శి, అడ్రస్సు : ఇంకేపల్లి, నడికూడె, పోష్టు, వయా, దాచేపల్లి, పల్నాడు తాలూకా.

---

# వెంకట్రామ అండ్ కో.

జనరల్ బుక్‌స్టోర్సు అండ్ షో రూమ్

## విజయవాడ

భాషాభివృద్ధి కనుగుణ వివిధ సారస్వత గ్రంథములు, ఆర్థిక, మత, రాజకీయ, చారిత్రక, వైజ్ఞానిక, వేదాంత గ్రంథములు – సంస్కృత, ఆంధ్ర ఆంగ్ల, హిందీ భాషలలో ఒకే చోట లభ్యమగునట్లు వెంకట్రామ అండ్ కో జనరల్ బుక్‌స్టోర్సు & షోరూమ్, విజయవాడలో నేర్పాటుచేసి యున్నాము. మా బ్రాంచీలలో మీకు కావలసిన అన్ని రకముల స్కూలు పుస్తకములు, జనరల్ బుక్సు స్టేషనరీ సరసమైన వెలలకు లభించును. భాషాభిమానులు, వర్తకులు మాకుతగిన ప్రోత్సాహమిప్పించ కోరుచున్నాము.

**VENKATRAMA & CO.**
General Book Stores & Show Room;
Main Road, VIJAYAWADA.

Having made its beginning on the Independence Day of 1951, It has successfully completed, Four years of its service to the Educational institutions, Public Libraries, Govt. Central Libraries and the general reading Public. It has been acclaimed as one of the unique ventures in Andhra Desa and has obtained several Certificates from eminent scholars and Educationists. You are repuested to encourage this endevour, where every book of Interest in several languages is stocked for the convenience of the Andhra Public.

Thanking you.

School Authorities are cordially requested to write for Specimen Copies to :

**M/s. VENKATRAMA & Co., (H. O.) Vijayavada**

Or their Branches at :—

| | | | |
|---|---|---|---|
| Madras | Ongole | Palacole | Nellore |
| Rajahmundry | Chittor | Tenali | Tadepalligudem |
| Cuddapah | Guntur | Kurnool | Secunderabad (Dn.) |

# నెల్లూరు జిల్లా

## బెజవాడ గోపాలరెడ్డి

కాంగ్రెస్ : సర్వేపల్లి నియోజకవర్గం, జననం : 5-8-1907, విద్య : విశ్వభారతి



విశ్వవిద్యాలయం పట్టభద్రుడు 1930 లో ప్రప్రథమంగా రాజకీయాలలో ప్రవేశించి సత్యాగ్రహంలో పాల్గొని 3 నెలల జైలుశిక్ష. విడుదలైన వెంటనే విద్యార్థుల ఊరేగింపు నడిపి తిరిగి 6 నెలలు శిక్ష 1932 లో 18 నెలలు, 1942 జాతీయోద్యమాలలోను జైలుశిక్ష. 1937 లో మద్రాసు శాసన సభకు ఎన్నికై రాజాజీ మంత్రివర్గంలో స్థానిక పరిపాలనా శాఖామంత్రి, 1944 నుండి ఆంధ్రా యూనివర్సిటీ సిండికేట్ సభ్యుడుగావుంటూ 1951 లో ప్రొఛాన్సలర్ గా నియామకం, 1946 లో ఉమ్మడి మద్రాసురాష్ట్ర శాసనసభకు ఎన్నికై శ్రీ ఓమండూరి రామస్వామి రెడ్డి, శ్రీ కుమారస్వామిరాజా మంత్రివర్గాలలో 1947-52 వరకు ఆర్థికమంత్రి అసెంబ్లీలో నాయకుడు, 1954 జనవరినుండి ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడు సాహిత్యంయందు ప్రత్యేకశ్రద్ధ. విశ్వకవి రవీంద్రుని గ్రంథాలను తెలుగులోకి అనువాదం. మొన్న జరిగిన ఎన్నికలలో నెల్లూరుజిల్లా ఆత్మకూరు, సర్వేపల్లి రెండు నియోజకవర్గాలనుండి ఎన్నిక, ప్రస్తుత ఆంధ్ర కాంగ్రెస్ లెజిస్లేచర్ పార్టీనాయకుడు, ప్రధానమంత్రి; అడ్రస్సు : సుదర్శనమహల్, మూలపేట, నెల్లూరు.

## కాశం వెంకటరెడ్డి

స్వతంత్ర : నందిపాడు నియోజకవర్గం, వయస్సు : 35 సం॥



విద్య : తెలుగు, 1932 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 46-51 ఆంధ్ర కాంగ్రెస్‌కమిటీ సభ్యుడు, అడ్రస్సు : వింజమూరు, ఉదయగిరతాలూకా.

## దిరిశాల వెంకటరమణారెడ్డి

కాంగ్రెస్ : దర్శి నియోజకవర్గం, జననం: 23-3-1907, విద్య: యస్.యస్.యల్.సి.



1932లో రాజకీయాలలో ప్రవేశం, దర్శి తాలూకాబోర్డు ఉపాధ్యక్షుడు, 1936-42 నెల్లూరు జిల్లా బోర్డు మెంబరు, ప్రస్తుతం మారెళ్ల పంచాయితీబోర్డు ఉపాధ్యక్షుడు, అడ్రస్సు : మారెళ్ల, వయా అద్దంకి.

---



---

## పాదిలేటి వెంకటస్వామిరెడ్డి

కాంగ్రెస్ : వెంకటగిరి నియోజకవర్గం, వయస్సు : 35, సం॥ విద్య: ఇంటర్మీడియట్, 1944 జమీందారీ ఉద్యమములో పాల్గొని రైతుల హక్కుల కొరకు పోరాటం, 1950 నుండి ప్రదేశ్ కాంగ్రెస్ సభ్యత్వం, తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు,



వెంకటగిరి పంట్ల ఉత్పత్తి సహకార సంఘం అధ్యక్షుడు, నెల్లూరు సెంట్రల్ కో ఆపరేటివ్ బ్యాంకి డైరెక్టరు, 1952 లో కాంగ్రెస్ అభ్యర్థిగా శాసనసభకు ఎన్నిక, ప్రత్యేక అభిమానం : రైతుఉద్యమము, అడ్రస్సు : పలుగోడు గ్రామము, వెంకటగిరి తాలూకా.

## బత్తిన రామకృష్ణారెడ్డి

ప్రజాపార్టీ : కావలి నియోజకవర్గం, జననం : 10-4-1908, విద్య : యఫ్. ఎ. 1921 లో కాంగ్రెస్ లో ప్రవేశించి సహాయనిరాకరణోద్యమములో విద్యావిరమణ, 1930లో 6 నెలలు, 40 లో 6 నెలలు, జైలుశిక్ష, 1942లో అరస్టయి 8 సం॥ లు



డిటెన్యూ, ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యనిర్వాహక సభ్యత్వం, 47-51 అఖిలభారత కాంగ్రెస్ సభ్యుడు, ఆంధ్ర ప్రజాపార్టీ కార్యదర్శి, 1937 లోను 51 లోను జరిగిన ఎన్నికలలో మద్రాసు శాసనసభకు ఎన్నిక, ప్రత్యేకఅభిమానం : భూసంస్కరణలు, అడ్రస్సు: అల్లూరు, నెల్లూరుజిల్లా.

## కమతం షణ్ముఖం

కాంగ్రెస్ : వెంకటగిరి ( రిజర్వుడు ) నియోజకవర్గం, జననం : 1903, విద్య : స్కూలు ఫైనలు, 1931 లో 1940 జాతీయోద్యమాల లో జైలు శిక్ష, 1937 - 52 కందుకూరునుండి శాసనసభకు ఎన్నిక, క్రిందటి శాసనసభ కాంగ్రెస్ పార్టీ



కార్యదర్శి, ప్రత్యేకఅభిమానం : హరిజన ఉద్యమము, అడ్రస్సు : కాంపాలెం, వెంకటగిరిటవున్.

## దివి కొండయ్యచౌదరి

కాంగ్రెస్ : కందుకూరు నియోజకవర్గం, జననం : 1-7-1918, విద్య: బి.ఏ.బి.యల్. 1940 కాంగ్రెస్ లో ప్రవేశం, కొంతకాలం విద్యార్థి కాంగ్రెస్ సభ్యుడు, 2 సం॥ నెల్లూరుజిల్లా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి, 1950 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడుగా



ఎన్నిక, 1954 లో కందుకూరు పంచాయితీ బోర్డు అధ్యక్షుడుగా ఎన్నిక, అడ్రస్సు : అడ్వకేటు, కందుకూరు.

## పిల్లేటి గోపాలకృష్ణారెడ్డి

కాంగ్రెస్ గూడూరు (జనరల్) నియోజకవర్గం, జననం 1920 విద్య, ఇంటర్మీడియట్ 1952 ఎన్నికలలో మద్రాసు శాసన సభకు గూడూరు నియోజకవర్గం నుండి కాంగ్రెస్ పక్ష సభ్యుడుగా ఎన్నిక ప్రత్యేక అభిమానం రైతు ఉద్యమము అడ్రెస్సు, కోట వయా, గూడూరు.



## మేర్లపాక మునుస్వామి

కాంగ్రెస్ గూడూరు (రిజర్వుడు) నియోజకవర్గం, జననం 1930 విద్య, బి. ఎ. ప్రత్యేక అభిమానం, విద్య - రాజకీయాలు వెంగానుగుల పాళెం, సూళ్లూరుపేట, తా॥

## షేక్ మహాలా సాహెబ్

కాంగ్రెస్ ఉదయగిరి, నియోజకవర్గం జననం, 1901 విద్య, 8 వ తరగతి, 1952 నుండి కాంగ్రెస్ వాది, తాలూకా, జిల్లాబోర్డు సభ్యుడు యెక్సైజ్ అడ్వయిజరీ కమిటీ సభ్యుడు, తాలూకా జిల్లా కాంగ్రెస్ సభ్యుడు ప్రత్యేక అభిమానం, నిరుద్యోగ నిర్మూలన కొరకు కృషి అడ్రెస్సు కనిగిరి, నెల్లూరు జిల్లా.



## స్వర్ణ వేమయ్య

కమ్యూనిస్టు, బుచ్చిరెడ్డి పాలెం, నియోజకవర్గం, జననం : 15-7-1919 విద్య, యస్. యస్. యల్. సి. కూలీ, టీచర్, వీవర్‌గా పనిచేసి 1932-40 కూలీసంఘాలలో కృషి 1934లో విద్యార్థి కాంగ్రెస్ కార్యకర్తగా 42 ఆగష్టు ఉద్యమములోను అరెస్టు 1943 నుండి 50 దాకా రెవెన్యూ ఇన్‌స్పెక్టర్ ఉద్యోగం చేసి రాజీనామా, 1952 ఎన్నికలలో మద్రాసు శాసన సభకు ఎన్నిక, మద్రాసు అసెంబ్లీలో పన్నుల విచారణ సంఘ సభ్యుడు, ఆంధ్ర రాష్ట్ర వ్యవసాయ కూలీసంఘ సభ్యుడు, 1952 నుండి నెల్లూరు జిల్లా కూలీ సంఘ ఉపాధ్యక్షుడు, ప్రత్యేక అభిమానం: నిరక్షరాస్య నిర్మూలన, ఆర్థిక వ్యత్యాసముల నిర్మూలన అడ్రెస్సు కొండూరు పాళెం, కొత్తవంగల్లు, పోస్టు, కోవూరు, తాలూకా.



## బవ్వారెడ్డి శంకరయ్య

కమ్యూనిస్టుపార్టీ: బుచ్చిరెడ్డి పాలెం, (జనరల్) నియోజకవర్గం, జననం 1914 విద్య, తెలుగు ఇంగ్లీషు 1930లో జాతీయోద్యమములో ప్రవేశించి కొంతకాలం నెల్లూరు జిల్లా కాంగ్రెస్ సహాయ కార్యదర్శి ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్ కమిటి సభ్యుడు 1936లో కమ్యూనిస్టు పార్టీలో ప్రవేశం 1938-నుండి45 నెల్లూరుజిల్లా రైతు సంఘ కార్యదర్శి, 1938 నుండి 48, 47 నుండి 58 వరకు నెల్లూరుజిల్లా కమ్యూనిస్టుపార్టీ



కార్యదర్శి, 1938లో మంతెన వారిపాలెం వేసవి పాఠశాల నిషేధ సందర్భంలో, 40-42 యుద్ధవ్యతిరేక ప్రచారం చేసినందుకు 46-47 పార్టీ నిషేధ కార్యక్రమములో 48-50 పార్టీపై నిషేధంలో, తిరిగి 1951 లోను అరెస్టయి మొత్తం 4½ సం॥ రముల జైలు జీవితం 1948 డిశంబరులో రాజమండ్రి జైలు నుండి పరారై 51 వరకు రహస్య జీవితం, ప్రత్యేక అభిమానం తత్వశాస్త్రం, అడ్రస్సు పప్పుల వీధి స్టోన్ హౌస్ పేట నెల్లూరు.

### నలమోతు చెంచురామానాయుడు

కాంగ్రెస్, కొండపి నియోజకవర్గం, జననం, 1915 సం॥ నవంబరు విద్య. స్కూలు ఫైనలు 1936 సం॥ కాంగ్రెస్‌లో ప్రవేశం ఇటీవలలో జిల్లా కాంగ్రెస్ రాష్ట్ర కాంగ్రెస్ కమిటీలలో సభ్యుడు ప్రస్తుతం, జిల్లా కాంగ్రెస్ ఉపాధ్యక్షుడు 1936 నవంబరు, నెలలో నెల్లూరు జిల్లా బోర్డు సభ్యుడుగా పోటీలేకుండా ఎన్నిక 1938 డిశంబరులో, జిల్లా బోర్డు ఉపాధ్యక్షునిగా ఎన్నిక. 24-10-1949 నుండి 1-7-1953 వరకు జిల్లాబోర్డు అధ్యక్షుడు, 1935-38 వరకు జరుగుమల్లి పంచాయితీబోర్డు అధ్యక్షుడు, 1952 ఎన్నికలలో ఉమ్మడి మద్రాసు శాసన సభకు ఎన్నిక, అడ్రస్సు చింతల పాలెం, జరుగుమల్లి పోస్టు, కందుకూరు, తాలూకా.



### గుజ్జుల యల్లమందారెడ్డి

కమ్యూనిస్టు, కనిగిరి, నియోజకవర్గం, జననం 1923 విద్య, ఇంటర్ మీడియట్ వరకు, నెల్లూరుజిల్లా విద్యార్థి ఫెడరేషన్ కార్యదర్శి ప్రస్తుతం జిల్లా రైతు సంఘ కార్యదర్శి రాష్ట్రకమిటీ మెంబరు 4 సం॥ ములు రహస్యజీవితం 1952 ఎన్నికలలో శాసన సభ్యుడుగా ఎన్నిక, ప్రత్యేక అభిమానం, రైతుకూలీ సంఘాలు, అడ్రస్సు నేరేడుపల్లి, కనిగిరి తా॥



### ఆనెం చెంచుసుబ్బారెడ్డి

కాంగ్రెస్, నెల్లూరు నియోజకవర్గం, జననం 18-3-1907 విద్య, ఇంటర్ మీడియట్ వ్యక్తి సత్యాగ్రహంలో 9-2-41 నుండి 5-8-41 వరకు జైలు శిక్ష 1935 నుండి నేటివరకు నెల్లూరు పురపాలక సంఘాధ్యక్షులు నెల్లూరు జిల్లా హోల్‌సేల్ కోఆపరేటివ్ స్టోర్సు ప్రెసిడెంటు, జిల్లా సెంట్రల్ కోఆపరేటివ్ బ్యాంకి డైరెక్టరు వి.ఆర్. కాలేజి (నెల్లూరు) వ్యవహారకర్త, 1948-51 ఆంధ్రవిశ్వకళాపరిషత్తు సెనెట్ సభ్యుడు, నెల్లూరు వేణుగోపాలస్వామి దేవాలయము మేనేజింగ్ ట్రస్టీ, ప్రత్యేక అభిమానం, వ్యవసాయం సహకారోద్యమము, అడ్రస్సు : కాపువీధి, నెల్లూరు.

### నాప కొమ్మకాశిరెడ్డి

కమ్యూనిస్టు : పొదిలి, నియోజకవర్గం, వయస్సు 30 సం॥ విద్య, బి. ఎ. వరకు 1927-47 విద్యార్థి ఫెడరేషన్ కార్యకర్త 49 నుండి కమ్యూనిస్టు పార్టీ సభ్యత్వం 49-51 రహస్య జీవితం, 1952 ఎన్నికలలో శాసన సభ్యుడుగా ఎన్నిక, అడ్రస్సు; నాగంపల్లె, పొదిలి, తాలూకా.

# చిత్తూరు జిల్లా

## నీలం సంజీవరెడ్డి

కాంగ్రెస్ : కాళహస్తి ( జనరల్ ) నియోజకవర్గం, జననం : 19-5-1913,



అనంతపురం ఆర్ట్సు కాలేజీలో చదువుగా విద్యకుస్వస్తి చెప్పి రాజకీయ రంగంలో ప్రవేశం, 1938 లో ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా ఎన్నిక, 1940, 42 జాతీయోద్యమాలలో జైలుశిక్ష, 1946 లో మద్రాసు అసెంబ్లీసభ్యుడుగా ఎన్నికై 1949 ఏప్రియల్ నుంచి 1951 ఏప్రియల్ వరకు మధ్యనిషేధ శాఖామంత్రి 1951 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షపదవికిపోటీచేస్తూ మంత్రిపదవికి రాజీనామా 1952-53 రాజ్యసభాసభ్యుడు 1953 సెప్టెంబరులో మద్రాసు అసెంబ్లీకి జరిగిన ఉపఎన్నికలో కాళహస్తినుండి ఎన్నిక, ఆంధ్రరాష్ట్ర విభజన జరిగినతరువాత లెజిస్లేచర్ కాంగ్రెస్‌పార్టీ నాయకునిగా ఎన్నిక, ప్రథమ ఆంధ్రమంత్రివర్గంలో డిప్యూటీ ముఖ్యమంత్రి, కొంతకాలం ఆంధ్ర కాంగ్రెస్ అధ్యక్షుడు, అఖిలభారత కాంగ్రెస్ కార్యవర్గంలోను, పార్లమెంటరీ బోర్డులోను సభ్యుడు. ప్రస్తుతం మంత్రివర్గంలో డిప్యూటీ ముఖ్యమంత్రి. అడ్రస్సు: కర్నూలు.

## పట్ర లింగరయ్య

కాంగ్రెస్ : కాళహస్తి (రిజర్వుడు) నియోజకవర్గం, జననం:15-6-1912, విద్య : జాతీయము 8వ ఫారం, ప్రత్యేక అభిమానం: హరిజన సేవ. అడ్రస్సు: ఇనగలూరు, మను లాలాపేట పోస్టు, వయా, వెంకటగిరి.



## టి. గోపాలకృష్ణయ్యగుప్తా

కాంగ్రెస్ : మదనపల్లి నియోజకవర్గం, జననం : 20-2-1917, విద్య : మెట్రిక్యులేషన్. 1928 లో కాంగ్రెస్‌లో ప్రవేశించి, 10 సం॥లుగా తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు, 20 సం॥ జిల్లాకాంగ్రెస్, 3 సం॥లు రాష్ట్ర, అఖిలభారత కాంగ్రెస్ సభ్యుడు,



1942 సత్యాగ్రహంలో 6 మాసములు జైలుశిక్ష, 1936-39 జిల్లాబోర్డు సభ్యుడు, 48 నుండి మదనపల్లి కో ఆపరేటివ్ బిల్డింగ్ సొసైటీ ప్రెసిడెంటు. ప్రత్యేక అభిమానం: కాంగ్రెస్ సేవ. అడ్రస్సు : మదనపల్లిపోస్టు.

## ఆర్. బి. రామకృష్ణరాజు

స్వతంత్ర : వడమాలపేట నియోజక వర్గం, జననం : 10-2-1891, విద్య: బి.ఎ. బి.యల్. 1935-54 డిశంబరువరకు కాంగ్రెసు సభ్యుడు. 37-39 మద్రాసు అసెంబ్లీ సభ్యుడు, 1940 వ్యక్తిసత్యాగ్రహంలో జైలు శిక్ష, 1942-44 డిశంబరు డిటెన్యూ, 1946-52 మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు, ఛైర్మన్. ప్రత్యేకఅభిమానం : సంగీతం, నాటకములు, లలితకళలు. అడ్రెస్సు : అడ్వకేటు, చిత్తూరు.



## పెద్దిరెడ్డి తిమ్మారెడ్డి

కాంగ్రెసు : వయల్పాడ్ నియోజక వర్గం, ఇదివరలో ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యదర్శి, 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు లోక్‌పార్టీ అభ్యర్థిగా పీలేరు నియోజకవర్గం నుండి ఎన్నిక, ప్రథమ ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గంలో సభ్యుడు ప్రస్తుతం కాంగ్రెస్ సభ్యుడు. అడ్రస్సు: ఉదయమాణిక్యం, చిత్తూరుజిల్లా.



## రెడ్డివారి నాదమునిరెడ్డి

కాంగ్రెసు, తిరుపతి, నియోజకవర్గం జననం, 1917 విద్య: పదవతరగతి 1934 సం॥ పాఠశాలను వదలి మద్యపాన నిషేధ సత్యాగ్రహములోను, 1941 వ్యక్తి సత్యాగ్రహంలోను 1942 ఉద్యమములోను జైలుశిక్ష. 1940 నుండి ప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడు, తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు 1953 జిల్లాకాంగ్రెస్ అధ్యక్షుడు 1938 జిల్లా బోర్డు సభ్యుడు 1946-51 వరకు అసెంబ్లీ సభ్యుడు 1951-53 మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు ప్రత్యేకభిమానం: సర్వజన శ్రేయోదాయకమగు పనులు, అడ్రస్సు: నరశింగాపురము చంద్రగిరి తాలూకా

## పసల గోపాలరెడ్డి

కాంగ్రెస్: తిరుత్తని (జనరల్) నియోజకవర్గం, జననం : 1906, విద్య : ఇంటర్ మీడియట్, 1932 నుండి కాంగ్రెసు సభ్యుడు, ఇదివరలో జిల్లా, తాలూకా కాంగ్రెసు కమిటి కార్యవర్గ సభ్యుడు, జిల్లా బోర్డు మెంబరు. ప్రత్యేకఅభిమానం: రైతు సేవ. అడ్రెస్సు : గాంధీరోడ్డు, తిరుత్తని.



## యం. దొరైకన్ను

కాంగ్రెసు : తిరుత్తని ( రిజర్వుడు ) నియోజకవర్గం, జననం : 21-6-1908, విద్య : స్కూలు ఫైనలు 1930 లో కాంగ్రెసులో ప్రవేశించి 1937 వ్యష్టిసత్యాగ్రహంలో జైలుశిక్ష, జిల్లా కాంగ్రెసు కమిటీ, జిల్లా హరిజన సేవకసంఘం, సహాయ

కార్యదర్శి, తిరుమల తిరుపతి దేవస్థానం కమిటీలో మొదటి హరిజన సభ్యుడు, 1938-40 చిత్తూరు జిల్లాబోర్డు సభ్యుడు 1951-54 ఏరియా కమిటీ మెంబరు. 1937 నుండి అసెంబ్లీ సభ్యుడు, ప్రత్యేక అభిమానం : దేశీయ వైద్యం, హరిజనుల అభివృద్ధికి కృషి. అడ్రెస్సు : పెద్దకలకటూరు, తిరుత్తని తాలూకా.



## రాజా వీరబసవచిక్కరాయలు

స్వతంత్ర : పుంగనూరు ( జనరల్ ) నియోజకవర్గం, జననం : 1914, విద్య : యస్.యస్.యల్.సి. ప్రత్యేక అభిమానం: జమిందారీ రైతుల పురోభివృద్ధి, అడ్రెస్సు : పుంగనూరు.

## ఆ. రత్నం

కాంగ్రెసు : పుంగనూరు (రిజర్వుడు) నియోజకవర్గం, విద్య : తెలుగు, 6 సం॥ లుగా కృషికార్ లోక్ పార్టీ సభ్యుడు, పలమనేరు తాలూకా హరిజనసంఘ అధ్యక్షుడు, ప్రత్యేక అభిమానం : హరిజన పురోభివృద్ధికి కృషి. అడ్రెస్సు : బైరెడ్డి పల్లి పోష్టు, పలమనేరు తాలూకా.



## పరియంబాడి చిన్నమరెడ్డి

కాంగ్రెసు : చిత్తూరు, నియోజకవర్గం జననం: 1897 విద్య: స్కూలు ఫైనలు 1920 నుంచి తాలూకా బోర్డు డిస్ట్రిక్టు బోర్డు మెంబరుగా ఉండి, కొంతకాలం తాలూకా బోర్డు ఉపాధ్యక్షుడు 1952 ఎన్నికలలో స్వతంత్ర అభ్యర్థిగా శాసన సభకు ఎన్నిక. అడ్రెస్సు: పరియంబాడి, చిత్తూరు తాలూకా.

## యస్. పి. చంగలరాయనాయుడు



కాంగ్రెసు : వేపాంజరి నియోజకవర్గం, విద్య : న్యాయవాద పట్టభద్రుడు, ఇదివరలో మదరాసు కౌన్సిలు సభ్యుడు, చిత్తూరు జిల్లా ప్రభుత్వ న్యాయవాది. అడ్రెస్సు : చిత్తూరు.

## యస్. రంగనాథ మొదలియార్

స్వతంత్ర, రామకృష్ణ రాజుపేట, నియోజకవర్గం, వయస్సు : 67 సం॥లు విద్య, న్యాయశాస్త్ర పట్టభద్రుడు గడచిన 20 సం॥ లుగా చిత్తూరు జిల్లా తమిళుల స్మృతి అభివృద్ధికి కృషి, ప్రత్యేక అభిమానం: చిత్తూరు జిల్లా తమిళ అల్ప సంఖ్యాక వర్గాల హక్కుల సంరక్షణ. అడ్రెస్సు : అడ్వకేటు చిత్తూరు.

## యస్. వెంకట్రామనాయుడు

కాంగ్రెస్ : పీలేరు నియోజకవర్గం, ఇదివరలో కృషికార్ లోక్ పార్టీ కార్యకర్త అడ్రెస్సు: కిసాన్ కుటీర్, పాకాల.

## టి. యస్. వెంకటసుబ్బారెడ్డి

కాంగ్రెస్: తంబళ్లపల్లి: నియోజకవర్గం, వయస్సు: 40 సం॥ రములు విద్య: హైస్కూలు విద్య పూర్తిచేసి 3 సం॥ రములు ఇంగ్లండులో విద్యాభ్యాసం. 1933 నుండి 9 సం॥ రములు జిల్లాబోర్డు మెంబరు 1952 ఎన్నికలలో ×ట్టు నియోజక వర్గం నుండి శాసన సభ్యుడుగా ఎన్నిక అడ్రస్సు గాంధీ రోడ్డు మదనపల్లి పోష్టు

## పి. రాజగోపాలనాయుడు



కాంగ్రెస్: తవనంపల్లె నియోజకవర్గం, ఇదివరలో కృషికలోక్ పార్టీ సహాయ కార్యదర్శి. అడ్రస్సు: దిగువ మాగం, అరగొండ పోష్టు.

## దున్నేకుల రామబ్రహ్మం

కాంగ్రెస్ : కుప్పం నియోజకవర్గం, జననం : 1910, విద్య : 5వ ఫారం, 1930 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 1941 లో 5 నెలలు జైలుశిక్ష. జిల్లాబోర్డు సభ్యుడు, చిత్తూరు జిల్లా కోఆపరేటివ్ హోల్‌సేల్ స్టోర్సు డైరక్టరు కుప్పం కోఆపరేటివ్ సీమ్‌లెస్ ఫ్డులువీవర్సు సొసైటీకి అధ్యక్షుడు, 1952 ఎన్నికలలో శాసనసభ్యుడుగా ఎన్నిక, ప్రత్యేకఅభిమానం : సహకారోద్యమము, రైతుసంఘాలు. అడ్రస్సు : కుప్పం, చిత్తూరుజిల్లా.



# కడప జిల్లా

## మహమ్మద్ రహింతుల్లా

కాంగ్రెస్ : కడప, నియోజకవర్గం, వయస్సు, 46 సం॥



కడప మునిసిపల్ చైర్మన్, బిల్డింగ్ సొసైటీ డైరక్టరు హాస్పటల్ అడ్వయిజరీకమిటీ మెంబరు ప్రత్యేక అభిమానం, ఇండస్ట్రీస్ ట్రాన్సుపోర్టు అడ్రస్సు: కడప.

## కడప కోటిరెడ్డి

కాంగ్రెస్ . లక్కి-రెడ్డిపల్లి నియోజకవర్గం, జననం : 1887, విద్య : బి.ఎ., యల్. యల్. బి. బారిస్టర్.1919లో బారిస్టరుగా



న్యాయవాద వృత్తి ప్రారంభం, 1923, 35 మద్రాసు లెజిస్లేటివ్ కౌన్సిల్ సభ్యుడు, 1937-39, 46-51, 52-55, శాసనసభ్యుడుగా ఎన్నిక, 1946 సం॥ మద్రాసులో ప్రకాశంగారి నాయకత్వాన ఏర్పడిన మంత్రివర్గంలోను, ప్రథమ ఆంధ్రరాష్ట్ర మంత్రివర్గంలోను సభ్యుడు, జాతీయోద్యమాలలో అనేకసంవత్సరాలు జైలుశిక్ష. అడ్రస్సు : కడప.

## పెంచికల బసివిరెడ్డి

కాంగ్రెస్ : పులివెందుల నియోజకవర్గం, జననం : 1-7-1908, విద్య : బి.ఏ. బి. యల్., 1941 లో కాంగ్రెస్‌లో చేరి 1946 లోను 49 లోను జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడుగా ఎన్నిక, రెండుసార్లు ప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడుగా ఎన్నిక,



26-1-50 నుండి మెనెల 52 వరకు పార్లమెంటు సభ్యుడు, 8 సంవత్సరాలు జిల్లా బోర్డు లీగల్ అడ్వయిజరు. అడ్రస్సు : అడ్వకేటు, కడప.

## బి. రత్నసభాపతిశెట్టి

ప్రజాసోషలిష్టు : బదవేలు నియోజకవర్గం, జననం : 23-3-1923, విద్య : బి. ఏ., 1947 నుండి సోషలిష్టుపార్టీ సభ్యుడు, 1950 నుండి ఆంధ్రరాష్ట్ర కమిటీ సభ్యుడు, 1954 నుండి ఆంధ్రరాష్ట్ర ప్రజాసోషలిష్టుపార్టీ కమిటి సహాయ కార్యదర్శి. అడ్రస్సు:నందలూరు.

## కుంద రామయ్య

కాంగ్రెస్ : జమ్ములమడుగు, నియోజకవర్గం, వయస్సు, 30 సం॥ రములు విద్య. యస్. యస్. యల్. సి. 1944 నుంచి కాంగ్రెస్ సభ్యుడు జమ్మలమడుగు కోయిల గుంట్లలో ఖాదీ ఉత్పత్తిసంస్థల స్థాపకుడు 1952 లో లోక్ పార్టీ అభ్యర్థిగా మద్రాసు శాసన సభకు ఎన్నిక ప్రత్యేక అభిమానం, ఖాదీఉద్యమము చేనేతసహకారోద్యమము, అడ్రస్సు: జమ్మలమడుగు



## వై. ఆదినారాయణరెడ్డి

కాంగ్రెస్ : రాయచోటి నియోజకవర్గం, జననం : 20-10-1916, విద్య : బి. ఏ., 1937 లో కాంగ్రెస్‌లో ప్రవేశించి 1940 - 47 జిల్లా కాంగ్రెస్ ప్రెసిడెంటు, 1941 సత్యాగ్రహంలో 3 నెలలు, 42 ఆగష్టు ఉద్యమములో 2 సం॥ లు జైలుశిక్ష, 1950 లో ప్రకాశంగారితో కాంగ్రెస్‌ను వదలిరి, ప్రజాపార్టీ కార్యదర్శిగా ఎన్నిక, 1952 ఎన్నికలలో ప్రజాపార్టీ అభ్యర్థిగా మద్రాసు శాసనసభకు ఎన్నిక, తిరిగి 1954 లో కాంగ్రెస్‌లో ప్రవేశం. అడ్రస్సు : చుండుపల్లెపోష్టు, కడపజిల్లా.



## పోతురాజు పార్థసారధి

కాంగ్రెస్ : రాజంపేట నియోజకవర్గం, జననం : 1-7-1916, విద్య: తెలుగు, ఇంగ్లీషు. 1935 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, 1942, 43 వ్యక్తిసత్యాగ్రహం, ఆగష్టు ఉద్యమాలలో జైలు శిక్ష, 1935 నుండి 4 సం॥లు కడపజిల్లా కాంగ్రెస్ కమిటి కార్యదర్శి, 1954-55 ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ కమిటి కార్యదర్శి, అఖిలభారత కాంగ్రెస్ కమిటి సభ్యుడు, ఆంధ్ర ఫల ఉత్పత్తిదారుల సంఘాధ్యక్షుడు. ప్రత్యేక అభిమానం : సారస్వతము, విదేశ వ్యవహారములు. అడ్రస్సు: పోస్టు, కోడూరు.



## పాలా వెంకటసుబ్బయ్య

కాంగ్రెస్ : రాజంపేట (రిజర్వుడు) నియోజకవర్గం, జననం : 11-11-1913, విద్య : యస్.యస్.యల్.సి., 15 సం॥లు సహకార శాఖలో సీనియర్ ఇన్‌స్పెక్టరు ఉద్యోగము చేసి 1952 ఎన్నికలలో మద్రాసు శాసనసభకు కాంగ్రెస్ అభ్యర్థిగా ఎన్నిక, బహుగ్రంధకర్త. ప్రత్యేక అభిమానం : కవిత్వము, గ్రంథరచనము. అడ్రస్సు : నాగరాజుపేట, కడప.



## నర్రెడ్డి శంభురెడ్డి

కాంగ్రెస్ : కమలాపురం, నియోజక వర్గం, జననం, 22-4-1923 విద్య: తెలుగు సంస్కృతం, 1942 రాజకీయాలలో ప్రవేశం ఆగష్టు ఉద్యమములో 1½ సం॥ లు జైలు శిక్ష పెద్ద చోట్ల రాజకీయ సంఘాలు, రాజకీయ పాఠశాలల నిర్మాత, 'ఆజాద్ హింద్' అనువారపత్రికను మూడు సం॥ ప్రచురించెను, అడ్రస్సు: వీరనాయునిపల్లె పాలగిరి, పోస్టు.



## కందుల బాలనారాయణరెడ్డి

కాంగ్రెస్ : ప్రొద్దుటూరు నియోజక వర్గం, జననం, 1904 విద్య: బి. ఎ. బి.యల్ 1940-42 జాతీయోద్యమాలలో కాంగ్రెస్ కార్యకర్త 1952 ఎన్నికలలో మద్రాసు శాసన సభకు ఎన్నిక, పార్టీవిప్ ఆంధ్ర ప్రదేశ్ కాంగ్రెస్ కమిటి సభ్యుడు, కడప జిల్లాబోర్డు ఉపాధ్యక్షుడు, ప్రొద్దుటూరు సహకార భూమితనఖా బ్యాంకి కార్యదర్శి, అధ్యక్షుడు, అడ్రస్సు, ప్రొద్దుటూరు.

## బి. రామారెడ్డి

స్వతంత్ర : మైదుకూరు నియోజక వర్గం, జననం : 1-7-1907, విద్య:ఇంటర్మీడియట్. 1929-38 జిల్లా సూపరింటెండెంట్ ఆఫీసులో ఉద్యోగం, దరిమిలా కాంగ్రెస్ లో చేరి 1839 లో జిల్లాబోర్డు సభ్యుడుగా ఎన్నిక, ప్రొద్దుటూరు కో-ఆపరేటివ్ లోన్ అండ్ సేల్సు సొసైటీ, భూమి తనఖా బ్యాంకి అధ్యక్షుడు. అడ్రస్సు : బద్వేలు.



---

# అనంతపురం జిల్లా

## కల్లూరి సుబ్బారావు

కాంగ్రెస్ : హిందుపురం ( జనరల్ ) నియోజకవర్గం, జననం, 25-5-1897, విద్య, మెట్రిక్ వరకు విద్యార్థిగా హోంరూలు ఉద్యమములో పాల్గొని 1920 లో కాంగ్రెస్‌లో ప్రవేశించి, 1921, 22, 30, 32, 41, సం॥ లలో జైలు శిక్ష. 1942 లో పెన్షన్ 2½ సం॥ లు అనంతపురంజిల్లా కాంగ్రెస్, కార్యదర్శి, అధ్యక్షుడు, 15 సం॥ అఖిలభారత కాంగ్రెస్‌సభ్యుడు, 1938 లో రాష్ట్ర మహాసభ అధ్యక్షుడు, ఆంధ్ర విశ్వ విద్యాలయము, రాయలసీమ ఆర్థికాభ్యుదయ బోర్డుసభ్యుడు, ప్రస్తుత ఆంధ్రశాసనసభ డిప్యూటీస్పీకరు లేపాక్షి చిత్రలేఖన పునరుద్ధరణ, ప్రత్యేక అభిమానం, సాహిత్యము, చిత్రలేఖనము అడ్రస్సు: భరతకుటీరము, హిందుపురం.



## పొందుపాటి ఆంథోనిరెడ్డి

కాంగ్రెస్ : అనంతపురం, నియోజకవర్గం, జననం, 1-7-1909, విద్య, యం. ఎ. యల్. టి. సేవాగ్రాంలో బేసిక్ విద్యయందు, శిక్షణ, 15 సం॥ లు హైస్కూలు, ట్రైనింగ్ స్కూళ్లకు హెడ్ మాష్టరు, 1944 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, జిల్లా కాంగ్రెస్ వైస్ ప్రెసిడెంటు, రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడు, అడ్రస్సు: పడమటి పలెరు, పోస్టు.

## బి. రుక్మిణీదేవి

కాంగ్రెస్: హిందుపురం, (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు, 27 సం॥ లు, విద్య, యస్.యస్.యల్.సి. సెకండరీ గ్రేడు ట్రయినింగ్. మున్సిపల్ కౌన్సిలర్, రాష్ట్ర హరిజన వెల్ఫేర్ కమిటీ సభ్యులు, మాజీ సెనెట్ సభ్యులు, అడ్రస్సు: అనంతపురం.



## పప్పూరి రామాచార్యులు

ఆంధ్రప్రజాపార్టీ: ధర్మవరం, నియోజకవర్గం, జననం, 7-11-1896, విద్య, బి.ఎ. (పార్టు) 1921 లో ప్రభుత్వోద్యోగము మాని సహాయనిరాకరణోద్యమములో ప్రవేశించి, 1932 లో 1942లో జైలుశిక్ష. 1926 నుండి తెనుగు వార పత్రిక "సాధన"కు



సంపాదకుడు, ప్రచురణకర్త, 1946 నుండి అనంతపురంజిల్లా కో ఆపరేటివ్ బ్యాంకి అధ్యక్షుడు, ఆంధ్రాస్టేటు బ్యాంకునకు ఇప్పుడు డైరెక్టరు, 1947 - 52 అనంతపురం మున్సిపల్ ఛైర్మన్, 1938 ఆంధ్ర గుడ్‌విల్ కమిటీ మెంబరు, 1947 అనంతపురంలో జరిగినరాయలసీమమహాసభ కన్వీనరు. అనంతపురంలోని పలువిధ సంస్థలలో సభ్యుడు, ప్రత్యేక అభిమానం, ఆంధ్ర సారస్వతము, అడ్రెస్సు : అనంతపురం.

## కె. శాంతప్ప

కాంగ్రెస్ : ధర్మవరం, (రిజర్వుడు) నియోజకవర్గం, వయస్సు, 58 సం॥ విద్య, ప్రాథమిక, 1925 నుండి కాంగ్రెస్ సభ్యుడు, 6 సం॥ తాలూకాబోర్డు 9 సం॥ జిల్లా బోర్డు సభ్యుడు, లేబర్ ప్రావిన్షియల్ అడ్వయిజరీబోర్డు,రాష్ట్ర హరిజన్ వెల్ ఫేర్ బోర్డు, ప్రొహిబిషన్ అడ్వయిజరీ కమిటీ, జిల్లా ప్లానింగుబోర్డు మెంబరు, కంబదూరు కోఆపరేటివ్ సొసైటీ ప్రసిడెంటు, 1952 ఎన్నికలలో కల్యాణదుర్గం నియోజకవర్గంనుండి శాసనసభకు ఎన్నిక, ప్రత్యేక అభిమానం, హరిజన ఉద్ధరణ, అడ్రెస్సు : కంబదూరు, కల్యాణదుర్గం తాలూకా.



## తరిమెల రామచంద్రారెడ్డి

కాంగ్రెస్ : పుట్లూరు, నియోజకవర్గం, జననం, 1915 విద్య, యస్.యస్.యల్.సి. 1935 లో రాజకీయాలలో ప్రవేశించి 1940 లో వ్యక్తిగత సత్యాగ్రహంలో 9 మాసాలు జైలుశిక్ష. 8 సం॥ లు తాలూకా కాంగ్రెస్ అధ్యక్షుడు, రెండు సార్లు, ప్రదేశ్ కాంగ్రెస్ అధ్యక్షుడుగాను, 1939 లో కాంగ్రెస్ పక్షాన జిల్లాబోర్డుకు పోటీ లేకుండాను ఎన్నిక. అడ్రెస్సు : తరిమెల, పోస్టు.



## ఎగవీధి చిదంబరరెడ్డి

కాంగ్రెస్ : పెనుగొండ, నియోజకవర్గం, జననం, 1914 విద్య, యస్. యస్. యల్.సి. 1934 లో కాంగ్రెస్ కార్యకర్తగా చేరి.1938 నుంచి నేటివరకు ప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడు, చాల ఏండ్లు గా జిల్లాకాంగ్రెస్ కార్యదర్శి, 1940 లో 9 నెలలు జైలుశిక్ష. 1935, 38, 49 సం॥ లలో కాంగ్రెస్ అభ్యర్థిగా అనంతపురం, జిల్లాబోర్డుకు ఏకగ్రీవఎన్నిక. 49, 53 వైస్ ప్రెసిడెంటు, 1945, 47, 49 జిల్లాకాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి, ప్రత్యేక అభిమానం, వ్యవసాయము, అడ్రెస్సు : పెదపల్లెపోస్టు, పెదపల్లె.



## యస్. సి. శేషాద్రి

కాంగ్రెస్ : రాయదుర్గ, నియోజకవర్గం, జననం, 10-10-21, విద్య, ఇంటర్

మీడియట్, హులిఃరోపతి డిప్లమా. 1940-44 వరకు రాయదుర్గపట్టణ కాంగ్రెస్ కమిటి కార్యదర్శి. 1945 లో కాంగ్రెస్ నుండి రాజీనామాచేసి తిరిగి 1946 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, ప్రస్తుతం, రాయదుర్గ, ఋణ, విక్రియ, సంఘ, అధ్యక్షుడు, విజయ కళాసమితి, రాయదుర్గ గృహనిర్మాణసంఘం, కార్యదర్శి, ఆంధ్రలో మొట్టమొదటుగా, మోడీ, కంటి ఆస్పత్రి నిర్వహణ, ప్రత్యేక అభిమానం, సంగీతము, నాటకములు, టెన్నీసు, హాకీ, అడ్రెస్సు: లక్ష్మీబజారు, రాయదుర్గ.

## పూల వెంకట రమణప్ప

కాంగ్రెస్: గోరంట్ల, నియోజకవర్గం, జననం, 15-7-1906 విద్య, బి.ఎ. గోరంట్ల హైస్కూలు కమిటీ పంచాయితీబోర్డు ప్రశిడెంటు, ప్రత్యేక అభిమానం, వ్యవసాయము, అడ్రెస్సు: గోరంట్ల, హిందుపురముతాలూకా.



## పందుర్తి బయ్యపరెడ్డి



కాంగ్రెస్: నల్లమాడ, నియోజకవర్గం, జననం, 1919, విద్య, బి.ఎ. ప్రత్యేక అభిమానం, గ్రామీణ సమస్యలు, అడ్రెస్సు: పందుర్తి, పెనుగొండ తాలూకా.

## కె. వి. వేమారెడ్డి

కాంగ్రెస్: కదిరి, నియోజకవర్గం, జననం, 6-1-1908, విద్య, బి.ఎ.యల్.యల్.బి. 1942 జిల్లాబోర్డు వైసు ప్రెసిడెంటు, 46-49 మునిసిపల్ కవున్సిలర్, కరువు నివారణ సంఘ అధ్యక్షుడు, మద్రాసు యూనివర్సిటీ మెంబరు, ఛేంబర్ ఆఫ్ డిస్ట్రిక్టుబోర్డులో కార్య నిర్వాహక సభ్యుడు, జిల్లా కాంగ్రెస్ కమిటీ ఉపాధ్యక్షుడు, ఆంధ్ర రాష్ట్ర కాంగ్రెస్‌పార్టీ సభ్యుడు, 1952 ఎన్నికలలో శాసనసభకు ఎన్నిక. ప్రత్యేక అభిమానం, సాంఘిక సేవ, అడ్రెస్సు: అడ్వకేటు, అనంతపురం.



## చల్లా సుబ్బారాయుడు

కాంగ్రెస్: తాడిపత్రి, నియోజకవర్గం, జననం, 14-11-1914 విద్య, యస్.యస్.యల్.సి. జి.డి.ఎ. (ప్యాస్,) డి.కాం. (ఐ.యం.సి.) 1951 వరకు కాంగ్రెస్‌సభ్యుడు, ఇదివరలో ప్రదేశ కాంగ్రెస్, జిల్లా కాంగ్రెస్ సభ్యుడు, 1952 ఎన్నికలలో కె.యం.పి. అభ్యర్థిగా శాసనసభకు ఎన్నిక. కొంతకాలం జిల్లాబోర్డు మెంబరు ప్రత్యేక అభిమానం, నిర్మాణ కార్యక్రమము, అడ్రెస్సు: తాడిపత్రి.



## యం. రాజారాం

కాంగ్రెస్: గుత్తి, (రిజర్వుడు) నియోజకవర్గం, జననం, 1-7-1922 విద్య, యస్. యస్. యల్. సి. 12 సం॥లు ఉపాధ్యాయుడుగా పనిచేసి గుంతకల్లులో హరిజన బాలుర వసతి గృహము స్థాపించి 5 సం॥లుగా దాని అభివృద్ధికి కృషి, హరిజన సేవా సంఘ సభ్యుడు, జిల్లా ఆది ఆంధ్ర సంఘ సభ్యుడు, ప్రత్యేక అభిమానం, ఇతరులకు సేవచేయుట, అడ్రస్సు: గుంతకల్లు.



## సండా నారాయణప్ప

కాంగ్రెస్: గుత్తి, (జనరల్) నియోజకవర్గం, జననం, 1-7-1918, విద్య, స్కూలు పైనలు 1936లో కాంగ్రెస్‌లో ప్రవేశం, 1942 ఉద్యమములో జైలుశిక్ష, 1952 ఆంధ్రరాష్ట్ర కాంగ్రెస్ కార్యవర్గ సభ్యుడు, ఆంధ్రరాష్ట్ర వెనుకబడిన జాతుల సంఘ ఉపాధ్యక్షుడు, 1943-53 ఉరవకొండ పంచాయితీబోర్డు అధ్యక్షుడుగా ఎన్నిక. ప్రత్యేక అభిమానం, హరిజనోద్ధరణ గ్రామోద్ధరణ, చేనేత అభివృద్ధి, అడ్రెస్సు: ఉరవకొండ.

# కర్నూలు జిల్లా

## మహబూబ్ ఆలీఖాన్

కాంగ్రెస్: కర్నూలు నియోజకవర్గం, జననం : 1890, విద్య : మూడవఫారం, పర్షియన్, అరబిక్, భాషలలో స్కాలర్. 1918 రాజకీయాలలో ప్రవేశం, డైరక్టరు, కో ఆపరేటివ్ అర్బన్ బ్యాంకి, హనుమాన్ కో ఆపరేటివ్ స్టోర్సు, హసాన్ కన్‌స్ట్రక్షన్ సొసైటీ, 1947 – 52 కర్నూలు మునిసిపల్ చైర్మన్, ప్రస్తుతం కౌన్సిల్ సభ్యుడు, సిటి ఇంప్రూవ్ మెంటు బోర్డు, రాజధానికమిటీ, జిల్లా కాంగ్రెస్ కమిటీ, ఆంధ్రా ముస్లింకల్చరల్ అసోసియేషన్, ఉస్మానియా కాలేజి మేనేజింగ్ కమిటీ సభ్యుడు, అరబిక్ కాలేజి,కర్నూలు ధర్మకర్త. ప్రత్యేకఅభిమానం: ప్రజాసేవ, అడ్రెస్సు : కర్నూలు.



## నక్కా వెంకటయ్య

కాంగ్రెస్ : ఎఱ్ఱగొండపాలెం, నియోజకవర్గం, జననం : 19-6-1909. విద్య, బి. ఎ. ఎ. ఆర్. ఐ. 4 సం॥లు కిర్లంపూడి పంచదార ఫ్యాక్టరీ జనరల్ మేనేజరు. 6 సం॥ లు సామర్లకోట పంచదారఫ్యాక్టరీ కెమిస్టు, 8 సంవత్సరములుగా ఉయ్యూరు పంచదారఫ్యాక్టరీ చీఫ్ కెమిస్టు, ఆంధ్రా సిమెంటుకంపెనీ. కన్సల్టింగ్ కెమిస్టు. 1952 ఎన్నికలలో లోక్‌పార్టీ అభ్యర్థిగా శాసనసభకు ఎన్నిక, ప్రత్యేక అభిమానం : పరిశ్రమలు, వాటి అభివృద్ధి, అడ్రెస్సు : మార్కాపురం, కర్నూలుజిల్లా.



## పిడతల రంగారెడ్డి

కాంగ్రెస్ : గిద్దలూరు, నియోజకవర్గం, జననం : 9-10-1917 విద్య, స్కూలుఫైనలు, 20 సం॥ లుగా కాంగ్రెస్ కార్యకర్త, 6 సం॥ లు జాతీయోద్యమాలలో జైలుశిక్ష. ఇదివరలో కర్నూలు జిల్లా కాంగ్రెస్ సంఘం అధ్యక్షుడు. పార్లమెంటు సభ్యుడు, 1952 ఎన్నికలలో అవిభక్త మద్రాసు రాష్ట్ర శాసనసభకు కంభం నియోజకవర్గంనుండి ఎన్నిక, అడ్రెస్సు : గిద్దలూరు.



## ఇ. అయ్యపురెడ్డి

కాంగ్రెస్ : నందికొట్కూరు (జనరల్) నియోజకవర్గం, జననం: 15-7-1933 విద్య, బి. ఎ. బి. యల్. కొంతకాలం విద్యార్థి ఉద్యమ కార్యకర్త, సోషలిస్టుపార్టీ సభ్యుడు, ప్రస్తుతం కాంగ్రెస్ సభ్యుడు : ప్రత్యేక అభిమానం: తెలుగు వాఙ్మయం. అడ్రస్సు : అడ్వకేటు, కర్నూలు.



## యస్. కె. లింగం

కాంగ్రెస్ : నందికొట్కూరు (రిజర్వుడు) నియోజకవర్గం, జననం: 17-7-1917 విద్య, యస్.యస్.యల్.సి. 17 సంవత్సరములు ప్రభుత్వ విద్యాశాఖలో పనిచేసి, 1949 లో కర్నూలులోని హరిజన విద్యార్థి వసతిగృహ కార్యదర్శిగా ఎన్నిక, జిల్లా హరిజన సేవక సంఘ కార్యదర్శి. కాంగ్రెస్ సభ్యుడు. అడ్రస్సు: హరిజన హాస్టల్ - కర్నూలు.



## విజయభాస్కరరెడ్డి

కాంగ్రెస్ : ఎమ్మిగనూరు (జనరల్) నియోజకవర్గం. జననం: 19-2-1923, విద్య బి. ఎ. బి. యల్. అడ్వకేటు. 1938 లో కాంగ్రెస్‌లో ప్రవేశం, విద్యార్థి ఉద్యమం కార్యకర్త, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ సభ్యుడు, అడ్రస్సు : లద్దగిరి, వయా, వెల్దుర్తి.



## దామోదర సంజీవయ్య

కాంగ్రెస్ : ఎమ్మిగనూరు (రిజర్వుడు) నియోజకవర్గం, జననం, 14-2-1921 విద్య, బి. ఎ. బి. యల్. ప్రభుత్వోద్యోగిగా ఉంటూ రాజీయిచ్చి 1950 లో కాంగ్రెస్ సభ్యుడుగా రాజ్యాంగ పరిషత్తుకు ఎన్నిక, 1952 లో మద్రాసు అసెంబ్లీకి ఎన్నికై రాజాజీమంత్రివర్గంలో సహకార శాఖామంత్రి. ఆంధ్రరాష్ట్రానికి ప్రకాశంగారి నాయకత్వాన ఏర్పడ్డ ప్రథమ మంత్రివర్గంలో ప్లానింగ్, ప్రజారోగ్యశాఖల మంత్రి, ప్రస్తుతం మంత్రివర్గంలో సభ్యుడు, అడ్రస్సు : కర్నూలు.



## టి. జి. తిమ్మయ్యసెట్టి

కాంగ్రెస్ : కోసిగి, నియోజకవర్గం, జననం: 1918 విద్య, ఇంటర్ మీడియట్ 1934 లో కాంగ్రెస్‌లో ప్రవే



కం 1942 ఆగస్టు ఉద్యమములో జైలుశిక్ష, కొంత కాలం బళ్లారిజిల్లా కాంగ్రెస్ సంఘం అధ్యక్షులు, నూనె మిల్లు యజమాని, భూస్వామి, అడ్రస్సు: అదోని.

## గోపవరం రామిరెడ్డి

స్వతంత్ర: నంద్యాలనియోజకవర్గం, జననం, 1916 విద్య: యస్. యస్ యల్. సి. 1937-4?లో జిల్లారైతు కాంగ్రెస్ అధ్యక్షుడు, 1940లో రైతురక్షణ యాత్రకు నాయకుడు, 1946-48 కర్నూలు జిల్లా కాంగ్రెస్ అధ్యక్షుడు, 1946-50 రాష్ట్ర కాంగ్రెస్ సభ్యుడు, ప్రత్యేక అభిమానం వ్యవసాయము, అడ్రస్సు: నంద్యాల.

## హనుమంతరెడ్డి

కాంగ్రెస్ : పత్తికొండ, నియోజకవర్గం, అడ్రస్సు : గుండ్లకొండ పత్తికొండ, తాలూకా.

## బి. పి. శేషారెడ్డి

స్వతంత్ర : డోన్, నియోజకవర్గం, అడ్రస్సు: 43 / 120 నరసింహారావు పేట, కర్నూలు.

## జి. బుసన్న

ప్రజాసోషలిస్టు, ఆదోని : నియోజకవర్గం, వయస్సు, 32 సం॥ విద్య : ఇంగ్లీషు మరాటి 1940-47 వరకు కాంగ్రెస్ సభ్యుడు ప్రత్యేక అభిమానం : వర్తకం, వాణిజ్యం అడ్రస్సు : ఆదోని.

## హ్యార్దగేరి రామలింగారెడ్డి

కాంగ్రెస్ : ఆలూరు, నియోజకవర్గం, జననం : 1912 విద్య, బి. ఎ. యల్. యల్. బి. 1945 బళ్లారి జిల్లా బోర్డు సభ్యుడు, 1952 ఎన్నికలలో స్వతంత్ర అభ్యర్థిగా మద్రాసు శాసనసభకు ఎన్నిక, ప్రత్యేక అభిమానం : రాజకీయము అడ్రస్సు: వకీలు, ఆదోని.

## చింతకుంట పి. తిమ్మారెడ్డి

కాంగ్రెస్ : శిరువెళ్ల నియోజకవర్గం, జననం, 1917 విద్య : యస్. యస్. యల్. సి. 1943-45 జిల్లాబోర్డు సభ్యుడు అనేకసంవత్సరాలుగా కాంగ్రెస్ కార్యకర్త. ప్రత్యేక అభిమానం, వ్యవసాయము వ్యాపారం అడ్రస్సు : నాగిరెడ్డిపల్లె పడకండ్ల శివారు, ఆళ్లగడ్డ తాలూకా.

## బి. వి. సుబ్బారెడ్డి

స్వతంత్ర : కోయిలకుంట్ల, నియోజకవర్గం, విద్య : న్యాయవాద పట్టభద్రుడు అడ్రస్సు: కోయిలకుంట్ల.

## కందుల ఓబులరెడ్డి

కాంగ్రెస్ మార్కాపురం, నియోజకవర్గం, ఇదివరలో, ఆంధ్రప్రదేశ్ కాంగ్రెస్ ప్రధాన కార్యదర్శి కృషికార్ లోక్ పార్టీ సభ్యుడు కొంతకాలం ఆంధ్రకృషికార్ లోక్ పార్టీ అధ్యక్షుడు, అడ్రస్సు: C/o జి. కోటిరెడ్డి మక్తర్ నగర్ వయా నిజామాబాద (దక్కన్)



# రవి టాయిలెట్స్ - రవి గ్లిసరిన్ సోప్

అందమునకు వర్ఛస్సునకు అన్ని కాలములలోను ముఖ్యముగా వేసవికాలములో వాడదగినది, శరీరమును మృదువుగను కాంతిగను ఉంచును.




## రవి వెజిటెబుల్ హెరాయిల్

శిరోజములను విస్తారముగా పెంపొందించును. దాని చక్కని సున్నితమైన సువాసన ప్రక్క అందరికినికూడ ఆనందము కలుగచేయును.

రవి స్నో :- ముఖవర్ఛస్సును కాపాడి, విలాసమును పెంపొందించును.

రవి టాల్కం పౌడరు:- పసిపిల్లలకుకూడ ఉపయోగించవచ్చును. మంచిసువాసనగలది.

సోల్ ఏజంట్సు :

## ది న్యూ స్టార్ అండ్ కో

వైద్యనాద మొదలివీధి, తండియార్ పేట, మద్రాసు-1

---




# హస్తం బీడీలే

## బహుశ్రేష్ఠమైనవి

★ చక్కని ఆలోచనలకు చురుకైన బీడీలు హస్తంబీడీ

★ వాడవాడ ఎన్నికగన్న బీడి హస్తంబీడి

★ కనికరించి కొనవద్దు కాల్చిచూసి కొనండి హస్తంబీడి

★ రకరకాల బీడీలలో రాణించేది హస్తంబీడి

★ వేడుకకు వినోదానికి హస్తంబీడి మంచిది

★ వేనకువేలు, లక్షలాదిప్రజలకు, వేల్పయినబీడి హస్తంబీడి.

